# భారత జాతికి నా హితవు

స్వామి వివేకానంద



శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు : : మద్రాసు-600 004

# మనవి

పరస్పర విరుద్ధమైన లక్ష్యములతో, అశాంతి పూరితమైన నేటి వాతావరణములో యువలోకమునకు విశిష్టమైన విలువలను ప్రతిపాదించుటకు రామకృష్ణ మిషన్, అద్వైత ఆశ్రమము వారు (మాయావతి, ఆల్మోరా, హిమాలయము) "Vivekananda His call to The Nation" అను చక్కని గ్రంథమును అతిస్వల్ప ధరకు ప్రచురించి యున్నారు. ఆంగ్లభాషరాని జిజ్ఞాసువులైన యువతీయువకుల కొందరు అట్టిది తెలుగులో లేకపోవుట యెంతయో కొరతగా భావించిరి. ఈ గ్రంథములో కొన్ని అంశములు అద్వైతాశ్రమము వారి అనుమతితో శ్రీ రామకృష్ణ సేవా సమితి, బాపట్ల వారు 1973 లో తెలుగులో ప్రచురించిరి. ఈ గ్రంథము 1983 న పునర్ముద్రింపబడింది.

డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం, ఎం.ఎ., పి.హెచ్‌డి., గారు తెలుగుసేతను పరిశీలించి సవరించి పెట్టినారు. వారికి మా ధన్యవాదములు.

వివేకానందస్వామి జీవిత చరిత్ర కూడ అతి సంగ్రహముగా పరిచయము కొరకు చేర్చబడియున్నది.

శ్రీ B.S.R. ఆంజనేయులు గారు ఈ మధ్య పత్రానకు రావడం తటస్థించినపుడు మేము ఈ గ్రంథమును ప్రచు

రింప పరిశీలించుచున్నట్లు పేర్కొన్న వెంటనే అమితానంద ముతో అంగీకరించిరి. వారికి మా కృతజ్ఞతలు.

శాశ్వత్వ మానవమగు యీ శ్రేయస్కర వాక్యములు యే కొలది యువ హృదయములనైనను రగుల్కొల్పి వారికి, వారిద్వారా యితరు లనేకులకు శాంతిసౌఖ్యములు చేకూర్చి నచో మా యీ కృషి సఫలీకృతమైనదని భావింతుము.

విజయదశమి
29-10-85

ప్రకాశకులు

# వివేకానందుడు - మహాజన వాణి

ఈనాడు వివేకానందస్వామి సందేశమును అక్షర రూపమున చదువుచున్నంత మాత్రముననే నా ఒడలు జలదరిస్తుంది. విద్యుదాఘాతము వలె ఆయన వచనాలు నన్ను కుదిపివేస్తాయి. అట్లాంటి ఆ దివ్యవాణిని, ఆయన ముఖతః వినియున్న శ్రోతలు ఎంతటి అనుభూతిని పొంది యుండిరో గదా।

—నోబెల్ బహుమతి గ్రహీత,

సుప్రసిద్ధ ఫ్రెంచి నవలా రచయిత — రోమారోలా.

వివేకానందస్వామి రచనలు నేను క్షుణ్ణంగా అధ్యయనం చేశాను. నా దేశమంటె నాకు గల ప్రేమ, ఆయన రచనలను మననం చేసుకున్న ఫలితంగా సహస్రాధికంగా పెంపు చెందింది.

—జాతిపిత - మహాత్మా గాంధీ.

భారతదేశాన్నిగూర్చి తెలుసుకోవాలంటె వివేకానందుని అధ్యయనం చెయ్యండి. ఆయన విధానములో అంతా నిర్మాణాత్మకమేగాని, వ్యతిరేకభావనకు తావులేదు.

—విశ్వకవి - రవీంద్రనాథ్ టాగూర్.

వివేకానందస్వామి నేడు ఉన్నట్లైతే నేనాయన పాద సన్నిధిలో యుండేవాడిని. నేను అతిశయోక్తి చెప్పకున్నట్లైతే—ఆధునిక భారతదేశము ఆయన సృష్టి

—నేతాజీ - సుభాష్ చంద్రబోస్.

ఎక్కడి పాశ్చాత్యులు! ఎక్కడి సనాతన ధర్మం. మహోన్నతమైన సనాతన ధర్మసందేశాన్ని పాశ్చాత్యులకు అనర్గళంగా చాటిన యీ వివేకానంద యతివరేణ్యునికి విబుధుల శిరస్సులంపై కృతాంజలులై వందనాలు అర్పించ కుండా యుండగలమా:

—మహావక్త - సురేంద్రనాథ్ బెనర్జీ.

శాశ్వతమైన విలువలుగాని, ఉన్నతమైన ఆదర్శ భావములుగాని లేకపోవుటచే, మానసిక కల్లోలమునకు గురి ఆయి అశాంతితో అల్లాడుచున్న, ప్రస్తుత భారతీయ యువజనులకు వివేకానంద సందేశ ప్రబోధ మాత్రమే సరి అయిన మార్గమును నిర్దేశింపగలదు. వ్యక్తి వికాసమునకు దేశపురోభివృద్ధికి అనువుగా భారతీయుల జీవన విధానమును తీర్చిదిద్దుటకు వివేకానందుని దివ్య ప్రబోధములే శరణ్యము.

నవభారత నిర్మాతలలో అగ్రగణ్యులైన స్వామి వివేకానంద శక్తి పీఠమైన మహా తత్వవేత్త. నిదురపోవుచున్న భారతజాతిని తట్టి మేల్కొలిపి జాగృత మొనర్చిన ఈ వైతాళికుని దివ్యసందేశము యావత్ప్రపంచానికి శిరోధార్యమే.

ఆయన సజీవ సందేశములోని కొన్ని మచ్చుతునకలు :—

- "యుగ . యుగాలుగా. గడ్డైన విశ్రాంతి నుండి బయట పడి. దీర్ఘ విశ్రమనుండి మేల్కొంచి భారతదేశము పాటి దేశములలో సముచిత స్థానము నలంకరింపవలసి యున్నది........

భారతదేశపు జాతీయ ధర్మములు త్యాగము, సేవ. ఈ మార్గములో దేశమును నడపవలెను. మిగిలిన దంతయూ దానికదే చక్కబడగలదు"

- "తనయందు తనకు నమ్మకము లేనివాడే నాస్తికుడు.... ఆత్మ విశ్వాసముగల కొందరు వ్యక్తుల చరిత్రమే ప్రపంచ చరిత్ర. ఆ విశ్వాసము వ్యక్తిలోని దివ్యత్వమును వెలికితీయును."
- "ఒకే భావము గైకొనుము. నీ జీవితమును ఆ ఒక్క భావముగా తీర్చిదిద్దుము. దానినే తలపోయుము. దానినే కలగనుము. ఆ భావములోనే జీవింపుము.........కార్యసిద్ధికి ఇదియే మార్గము."
- "ఎంతో తపస్సు చేసిన మీదట పరమసత్యము ఇది అని నేను అర్థము చేసికొంటిని—ప్రతి జీవియందును భగవంతుడున్నాడు. అంతకుమించి వేరే దైవము లేదు. ఎవరు జీవారాధకుడో అతడే నిజముగా ఈశ్వరారాధకుడు."
- "మృగమును మానవునిగా,
మానవుని మాధవునిగా ఉన్నత స్థితికి గొనిపోవు భావమే మతము."
- "మతములోని అసలు మర్మం అంతా ఆచరణములో మన్నదిగాని, సిద్ధాంతములలో లేదు. మంచిగా నుండుట, మంచిని చేయుట—ఇదియే మత సర్వస్వము."
- ..............మన స్త్రీజనము ఉద్ధరించుట చాలా ముఖ్యావశ్యము. మన దేశ స్త్రీలకు మనం చేయవలసిన సేవ - వారికి విద్య నేర్పుటయే. వారు కోల్పోయిన వ్యక్తిత్వమును వారిలో పెంపుచేయుటయే"

# విషయసూచిక

# 1. వివేకానంద సంగ్రహ జీవిత చరిత్ర

వివేకానందస్వామి కలకత్తాలో 1863 జనవరి 12 వ తేది సోమవారమునాడు భువనేశ్వరీ దేవికిని, విశ్వనాథదత్తునకు జన్మించెను. బాల్యమున అతడు నరేంద్రనాథదత్త లేక నరేన్ అని పిలువబడెడువాడు. దత్తవంశము సంపన్నమై, దానధర్మములకు, విద్యకు, స్వాతంత్ర్య భావములకు పేరెన్నిక గాంచినది. వివేకానందుని తాతగారైన దుర్గాచరణదత్తు ప్రపంచముపై రోసి కుమారుడైన విశ్వనాథదత్తు జన్మించిన తర్వాత తన ఇరువది ఐదవయేట సన్యసించెను.

విశ్వనాథదత్తు కలకత్తా హైకోర్టులో న్యాయవాది. ఇంగ్లీషు, పర్షియను భాషలలో ప్రవీణుడు. బైబిలు, హిందూ, సంస్కృత గ్రంథములను మక్కువతో చదివెడివాడు. పేదలయందు ఆదరణయే గాక సాంఘిక, మత

విషయములందు విమర్శనాత్మక, అభ్యుదయ దృక్పథము కలవాడు.

భువనేశ్వరీదేవి రాజసిరిగల పూర్ణవ్యక్తి. స్త్రీ సంతాన మున్నను, పుత్రునకై తన బంధువులద్వారా కాశీలో వీరేశ్వర విశ్వేశ్వరునకు మొక్కుబడులు చెల్లించెను. కలలో శివుడు దర్శనమిచ్చి పుత్రుడుగా జన్మింతునని చెప్పెను. తర్వాత నరేంద్రనాథుడు జన్మించెను.

శైశవమున నరేన్ అల్లరివాడు. వినోదములతోను, ఆటలతోను కాలము గడిపెడివాడు. తల్లి చెప్పుచుండిన రామాయణ, భారత కథలు అతని మనస్సుపై చెరగని ముద్ర వేసెను. ధైర్యము, సాధువులయందు ప్రేమ అతనిలో అకస్మాత్తుగా ప్రస్ఫుటమయ్యెడివి. ప్రతివిషయమును విమర్శించుచు, మేధాశక్తి, భావనాలక్షణములతో పెరిగి ఉత్సాహవంతుడైన యువకుడయ్యెను.

యువనరేంద్రుడు సౌందర్యము, ధైర్యము, అంగసౌష్ఠవము కలిగి వ్యాయామములోను, వేదాంతశాస్త్రమందును, సంగీతమందును తన సహాధ్యాయులలో నిర్వివాదమైన నాయ

కలుగా నన్నెక్కెను. కళాశాలలో నేర్చిన పాశ్చాత్య సిద్ధాంతములు, స్వాభావికముగా వచ్చిన ప్రాచీన సంప్రదాయముల యందలి విశ్వాసము, సూక్ష్మబుద్ధితో కూడిన హేతుబద్ధమైన స్వభావము ఒకదానితో నొకటి పెనుగులాడుచుండెను. ఆనాడు మహోద్యమముగా యున్న బ్రహ్మసమాజములో కొంత శాంతి లభించునని ప్రయత్నించెను. ప్రఖ్యాత మత నాయకులను కలుసుకొనెను. కాని 'దేవు డున్నాడా?' అన్న తన ప్రశ్నకు సంతృప్తికర మైన సమాధానము పొందలేకపోయెను.

ఈ సందిగ్ధస్థితిలో తన కాలేజి ఆచార్యుడైన విలియం హేస్టీవలన వినియుండుటచేతను, తన బంధువైన రామచంద్రదత్త ప్రోత్సాహమువలనను 1881లో దక్షిణేశ్వరమున నున్న శ్రీ రామకృష్ణపరమహంసను కలిసికొనెను. "అయ్యా మీరు దేవుని చూచితిరా?" అని తాను వేసిన ప్రశ్నకు "ఔను, నేను భగవంతుని దర్శించితిని. నిన్నిప్పుడు. చూచుచున్న దానికంటె విస్పష్టముగా దర్శించితి" నని రామకృష్ణులు స్వానుభవపూర్వకముగా చెప్పిన

సమాధానముచే అతని సంశయం నివృత్తి యాయెను. శిష్యుని క్రమశిక్షణ ప్రారంభ మయ్యెను.

గురు శిష్యులు ఒకరి నొకరు ఎన్నో విధముల పరీక్షించుకొనిరి. 1884 లో తండ్రి మరణముతో నరేంద్రనాథుని కుటుంబము యిక్కట్టుల పాలాయెను. గురుదేవుని సలహాపై కాళీ మాతను తన కుటుంబపరిస్థితిని తొలగింపుమని వేడుకొనుటకు ముమ్మారు యత్నించినను "జ్ఞాన మిమ్మని, భక్తి నిమ్మని మాత్రమే" ప్రార్థింపగలిగెను.

క్రమ క్రమముగా నరేంద్రనాథ్ గురుదేవునకు శరణాగతు డయ్యెను. శ్రీ రామకృష్ణులు అతని సంశయమునుండి నిర్భయమునకు, ఆవేదననుండి ఆధ్యాత్మికానందమునకును గొనివచ్చెను. 1885 లో శ్రీ రామకృష్ణుల కంఠమందలి వ్యాధినిమిత్తమై కలకత్తాలోని కాశీపూరునకు గొనివచ్చిరి. తన యువశిష్యులను నరేంద్రుని నాయకత్వములోనికి గొనివచ్చుటకు రామకృష్ణులు ఈ అవకాశమును వినియోగించుకొనెను. రామ మహాసమాధి

చెందుటకు మూడు నాల్గు దినములకు పూర్వము శ్రీరామకృష్ణులు తన శక్తినంతయు నరేంద్రునకు ధారపోసి యిట్లనెను: "నేను నీ కిచ్చిన యీ శక్తిప్రభావమున నీచే అనేక అద్భుత కార్యములు సాధింపబడును. ఆ తర్వాతనే నీవు నీ ధామమున కేగుదువు."

1886 సం॥ ఆగస్టు 16 వ తేది శ్రీరామకృష్ణులు నిర్యాణము చెందెను. నరేంద్రుని నాయకత్వమున యువశిష్యులతో బారానగరమున పాడుపడిన యొక కొంపలో "శ్రీ రామకృష్ణ సోదర బృందము" అనుదానికి పునాది వేయబడెను. 1886 క్రిస్టమసు నాటి రాత్రి వారు అంతపుర మను గ్రామములో అగ్ని సమక్షమున సన్యాసదీక్ష తీసుకొనిరి. పరివ్రాజక జీవితము వారిందరిని ఆకర్షించెను. నరేంద్రుడు 1890 లో బారానగర మఠమును, తన సోదరులను పూర్తిగా విడిచి, తన వ్యక్తిత్వము తెలియకుండుటకై వేరువేరు పేర్లతో కాశీ, లక్నో, ఆగ్రా, బృందావనము, హత్రస్, ఋషీకేశము వెళ్ళెను. హత్రస్ వెళ్ళినపుడు అచ్చట రైల్వే ఉద్యోగిగా పనిచేయుచున్న

శరత్ చంద్రగుప్త తన ఉద్యోగము రాజీనామా చేసి, స్వామికి ప్రథమ శిష్యుడై అతని ననుగమించెను.

శ్రీ రామకృష్ణ నిర్యాణానంతరము యువ సన్యాసులకు శ్రీ శారదాదేవి ఆధ్యాత్మిక మార్గదర్శిగా నుండెను. ఆమె వద్దను, సోదర శిష్యుల వద్దను సెలవుగైకొని 1890 జూలైలో అతడు హిమాలయములలో ఏకాంతవాస మొనర్చుటకై బయలుదేరెను. ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, గుజరాతు, మహారాష్ట్ర, మైసూరు కేరళ, మద్రాసు, హైదరాబాదు మొదలగు ప్రదేశములలోని చారిత్రాత్మక యాత్రాస్థానముల నన్నింటిని చూచెను. ఎక్కడ చూచినను ప్రాచీన భారతదేశవైభవము, ఈ గొప్ప సంస్కృతి మధ్యమున భారత జనసామాన్య దుర్భర దురవస్థ అతని మనోనేత్రముల ముందు ప్రత్యక్షమయ్యెను. అతడనేక ప్రముఖ వ్యక్తులను, సంస్థానాధీశులను కలిసికొనెను. వారిలో ఖేత్రీమహారాజు అతనికి ముఖ్య స్నేహితుడు, శిష్యుడు అయ్యెను.

పూనాలో బాలగంగాధర తిలక్‌నకు అతిథిగా నుండెను. అక్కడ నుండి త్రివేంద్రము మీదుగా కన్యాకుమారి దర్శించెను. అమ్మవారి ముందు హృదయావేదనతో సాష్టాంగపడి సముద్రమును ఈది దక్షిణమున నున్న గుట్టపై ధ్యానములో మునిగిపోయెను. భారతదేశ ప్రాచీనస్థితి, ప్రస్తుతస్థితి, భవిష్యత్ స్థితి, ఆ ధ్యానములో ఆయన కన్నుల ముందు నడచిపోయెను. తాను పాశ్చాత్యదేశముల కేగి భారత ప్రజలకై సహాయ మర్థింతునను ఒక ముఖ్య నిర్ణయమును అప్పుడు గైకొనెను. ఈ నిర్ణయములో రామేశ్వరము, మధురమీదుగా మద్రాసు చేరెను. మద్రాసులో అలసింగపెరుమాళ్ నాయకత్వమున యువక బృందమొకటి ఆయన నాహ్వానించి పాశ్చాత్య దేశముల కేగుటకు ధనము పోగుచేసెను. కాని స్వామి దానిని నిరాకరించెను. శ్రీ రామకృష్ణుని ఆదేశము, శారదాదేవి అంగీకారము లభించిన తర్వాతనే అమెరికా కేగు సన్నాహములను అంగీకరించెను. హైదరాబాదులో యున్నప్పుడు ఖేత్రీరాజునకు కుమారుడు కల్గ

టచే ఆయన ఆహ్వానము ననుసరించి అక్కడ కేగెను. అక్కడనే మహారాజు సూచన ప్రకారము "వివేకానంద" నామమును ధరించెను. మహారాజు చేసిన యేర్పాట్ల ననుసరించి స్వామి 31 మే 1893 న బొంబాయిలో ఓడ నెక్కి అమెరికాకు బయలుదేరెను.

వివేకానందస్వామి చైనా, జపాను, కెనడా మీదుగా జూలై మధ్యభాగమున చికాగో చేరుకొనెను. జపాను ప్రజల పారిశుద్ధ్యము, వారి పారిశ్రామికాభివృద్ధిని గమనించి ఆశ్చర్యమొందెను. చికాగోయందు పాశ్చాత్యుల సృజనాశక్తిని చూచి తత్తరపడెను. అక్కడ సర్వమత మహాసభ సెప్టెంబరు వరకు జరుగదనియు, అధికారపత్రము లేనిదే సభకు రానీయరనియు తెలిసికొని నిస్పృహ చెందెను. అందుచే చికాగోకంటె ఖర్చు తక్కువగా యుండు బోస్టనున కేగెను. రైలులో దైవవశమున కుమారి కాథరీన్ శారబానుతో పరిచయము కలిగెను. ఆమె మన స్వామికి హార్వర్డు విశ్వవిద్యాలయములోని గ్రీకుశాఖ అధ్యక్షుడయిన ప్రొఫెసర్ జాన్ హెన్రీరైట్

పరిచయమును కలిగించెను. ఆ ఆచార్యుడు వివేకానందస్వామిని లోకోత్తర ప్రతిభా విరాజితునిగ అర్థము చేసికొని, విశ్వమత మహాసభకు అభ్యర్థులను ఎన్నుకొను సమితికి అధ్యక్షుడుగానున్న డాక్టరు బర్రోసు అనునాయనకు లేఖను వ్రాసి స్వామి కిచ్చెను. మరికొన్ని పరిచయ పత్రములను కూడ వ్రాసి ఆయన స్వామి కిచ్చెను. ప్రయాణమునకు ధనమ్మును కూడ స్వామికి అందించి ఆదరపూర్వకముగా ఆయన స్వామిని చికాగో నగరమునకు పంపించెను. డాక్టరు బర్రోసుకు వ్రాసిన పత్రములో రైటు పండితుడు స్వామిని గూర్చి ఇట్లు ప్రశంసించెను. "విద్యావేత్తలయిన మన ఆచార్యుల నందరను ఒకచోట చేర్చినను, వారందరి కంటెను అధిక విద్యావంతుడు ఈ వ్యక్తి."

సర్వమత మహాసభ ప్రారంభమునకు రెండు రోజులు ముందు స్వామి చికాగోకు తిరిగి వచ్చెను. కాని దురదృష్టవశాత్తు చిరునామా కాగితాలను పారవేసికొని ఆరాత్రి చలిబాధకు లోనై ఉదయము లేవ నీ కష్టము నుండి యెవరు గట్టెక్కింతురా యని వెదుక

నారంభించెను. నిష్ప్రయోజనమైన తిరుగుడుచే తప్పిపోయి దైవమునకు శరణుకోచ్చి రోడ్డు ప్రక్కన చతికిలబడెను. అకస్మాత్తుగా తన యెదుటగల సుందర భవనమునుండి ఒక స్త్రీ బయటకు వచ్చి సహాయముచేయ నుద్యుక్త రాలయ్యెను. ఆమెయే ఆ యింటి యిల్లాలైన జార్జి డబ్ల్యు హేలు సతి.

1893 సెప్టెంబరు 11 వ తేదీన సర్వమత మహాసభ ప్రారంభమయ్యెను. 7000 మంది మేధావులతో సభ క్రిక్కిరిసి యుండెను. మతము లన్నింటికి చెందిన ప్రతినిధులు వేదికపై ఆసీను లైరి. స్వామి అంత పెద్ద సభలో యెన్నడును ప్రసంగించ లేదు. తన వంతు వచ్చినప్పుడు సరస్వతీదేవికి ప్రణమిల్లి "అమెరికా సోదర సోదరీమణులారా" అని ఆరంభించెను. రెండు నిమిషములు సభలో జయజయ ధ్వనులు చెల రేగెను. "7000 మంది తమకు తెలియని దేనినో గౌరవించుటకై మునివేళ్ళపై నిల చిరి." మరునాటి వార్తాపత్రికలన్నియు సర్వ మత సభలోని అత్యుత్తమ వ్యక్తిగా స్వామిని వర్ణించినవి. మిగతా ప్రతినిధులందరూ వారి

వారి మతములను గూర్చి ఉపన్యసింపగా స్వామి "ఆకాశమువలె విస్తారము, అంబుధివలె అగాధము" అయిన మతమును గూర్చి ఉపన్యసించెను. ఆయన ఏకసూత్రము — విశ్వవ్యాపకత.

స్వామి ప్రతిభను ఉపయోగించుకొని ఒక ఉపన్యాససంస్థ ఆయనను దేశమంతయు త్రిప్పెను. వారి ప్రవర్తనకు రోతపుట్టి స్వామి ఆ సంస్థతో తెగతెంపులు చేసికొనెను. శీలవంతులైన విద్యార్థులకు ఉచిత ప్రసంగము లిచ్చుచు న్యూయార్కులో వేదాంత సొసైటీని ఏర్పాటు చేసెను. ఇంగ్లండునకు విజయవంతమైన రెండు పర్యటనలు చేసెను. సెవియర్ దంపతులు, సోదరి నివేదిత యీ సమయముననే శిష్యులైరి. న్యూయార్కులో ఉండగా జె. జె. గుడ్విన్ అను సంక్షిప్త లేఖకుడు శిష్యుడయ్యెను. స్వామి యుపన్యాసములు యథాతథముగా లభించుటకు కారకుడు ఈ మహాశయుడే. ఈ పర్యటనలలోనే మాక్సు ముల్లరు పండితుని, జర్మను ప్రాచ్యపండితుడైన పాల్ డ్యూసన్‌ను కలిసికొనెను.

అన్ని మతములకు మూలసిద్ధాంతమైన వేదాంతమును పాశ్చాత్యదేశములలో మూడు సంవత్సరములు ప్రచారముచేసి తన పునరాగతమునకై ఆతురత చెందుతున్న మాతృదేశమునకు 1896 సంవత్సరాంతమున బయలుదేరెను. దారిలో రోము, యిటలీలోని యితర ప్రదేశములను దర్శించెను. అతనితో గూడ సేవియరు దంపతులు, గుడ్విను వచ్చిరి.

స్వామి వచ్చుచున్నాడను వార్త భారతదేశమునకు ముందుగనే తెలియుటచే చిన్న, పెద్ద పట్టణములన్నింటిలోను ఆహ్వానసంఘము లేర్పాటయ్యెను. కొలంబోనుండి అల్మోరా వరకు స్వామి ఉపన్యసించెను. మద్రాసులో ఐదు ఉపన్యాసము లిచ్చెను. ఈ ఉపన్యాసము లన్నింటి సారాంశము:— "బలహీనత, మూఢాచారముల త్రోసివేత, భారతదేశ నిర్మాణము." భారత 'జాతీయ జీవనరాగశ్రుతి' మతమనియు, ఆ మతము విశ్వమున కంతటికి ఆధ్యాత్మిక ఏకత్వ మనియు బోధించెను. పాశ్చాత్యానుకరణమును, కుల దురభిమానమును విమర్శించుటలో వెనుకాడలేదు.

తన జన్మస్థానమైన కలకత్తాలో 1897 ఫిబ్రవరిలో మాటలాడుచు తన ఆచరణ, ఆలోచనలచే సాధింపబడిన మంచి ఏదైనా యున్నచో అది యంతయు తన గురుదేవునిదే అనియు, 'మన ఈజాతి అభ్యుదయము చెందదలచినచో ఆయన పవిత్రనామము చెంతకే చేరవలయు' ననియు చెప్పెను.

1897 మే నెలలో గృహస్థ శిష్యులను, సన్యాస శిష్యులను బలరాంబోసు యింటివద్ద సమావేశ పరచి 'రామకృష్ణ మిషన్' ఏర్పరచె, తన ఆశయముల నాచరణలోనికి గొని వచ్చు యంత్రాంగమునకు ప్రారంభోత్సవము చేసెను. 1898 మే నెలలో కలకత్తాలో సంభవించిన ప్లేగు వ్యాధి నివారణకు సేవాకార్యక్రమము నేర్పరచి అదుపులోనికి తెచ్చెను.

పాశ్చాత్యశిష్యులు (ముఖ్యముగా నివేదిత)తో నైనిటాలు, అల్మోరా, కాశ్మీరు పవిత్ర అమరనాథు దర్శించెను. గోచీ మాత్రమే ధరించి అమరనాథ్ గుహాలో ప్రవేశించెను. ఇది మరపురాని అనుభూతి. తర్వాత క్షీరభవాని అమ్మవారి ఆలయమును దర్శించెను. ఇచ్చట

స్వామీజీకి తన ప్రవృత్తిలో మలుపు తెచ్చిన మరియొక అనుభూతి కలిగి అతడు జగజ్జననీ భావములో నిండిపోయెను. అక్టోబరు 18 న కలకత్తా చేరినప్పుడు అతడు బలహీనముగాను వెలవెలబారి అనేక రుగ్మతలతో బాధపడెను. అయినను ఈ సమయముననే కలకత్తాకు 5 మైళ్ళ దూరమున కొంత భూమికొని మఠము నిర్మించెను. 9-12-1898 నాడు వివేకానంద స్వామి స్వయముగా బేలూరు మఠమునకు సంప్రోక్షణ మొనర్చెను. 2-1-1899 నాటి నుండి శ్రీరామకృష్ణ సంస్థకు ఈ బేలూరు కేంద్రస్థానమై అలరారుచున్నది. స్వామి ఆదేశము మేరకు శారదానందస్వామి అమెరికా నుండి తిరిగి వచ్చి బేలూరు మఠమున కార్యదర్శిగా బాధ్యత స్వీకరించెను. ఈ సమయముననే 'ఉద్బోధన్' అను బెంగాలీ మాసపత్రిక ప్రారంభింపబడెను. మాయావతి (అల్మోరా)లో అద్వైతాశ్రమము ఏర్పరుపబడెను. మద్రాసులో నడుపబడుచున్న 'ప్రబుద్ధ భారత' అను మాసపత్రిక, దాని సంపాదకుని మకరానంతరము అద్వైతాశ్రమమునకు మార్చబడెను.

సంతత శ్రమవలన స్వామి ఆరోగ్యము క్షీణ గతి పట్టుటచే సోదర శిష్యులు కూడ కోరి నందున 1899 జూన్ 20 వ తేది ఆయన రెండవమారు పాశ్చాత్యదేశముల కేగెను. సోదరి నివేదిత, స్వామి తురీయానంద వెంట నుండిరి. ఓడ మద్రాసు, కొలంబో, ఏడెన్, మార్సెలిస్ మీదుగా లండన్ చేరెను. స్వామి ఆరోగ్యము కొంత మెరుగయ్యెను.

లండన్ నుండి న్యూయార్కు చేరి హడ్సను తీరమున లెగెట్టు దంపతుల సుందరగ్రామ శిబిరమున కొన్ని మాసములుండి పశ్చిమతీర మందలి లాస్ ఏంజలిస్, ఓక్‌లాండ్, శాన్ ఫ్రాన్సిస్కో దర్శించి చికాగోకు డెట్రాయిట్‌కు కొన్నిసార్లు వెళ్ళి వెంటనే తిరిగి వచ్చెను.

ఈ సమయమున స్వామి దృక్పథము గట్టి పడెను. ప్రాక్పశ్చిమ దేశములు అన్యోన్య సహాయములో నుండి యొకరికొకరు తోడ్పడి తీరవలయును. పశ్చిమము బాహ్యప్రకృతిని, ప్రాచ్యము అంతర ప్రకృతిని జయించుటకు యత్నించినవి. ఇప్పుడు అవి చేయి చేయికలిపి వాటి వాటి ప్రత్యేక లక్షణములను రూపు

మాపకనే ఒండొరుల శ్రేయమునకై గట్టిగా పనిచేయవలయును. ప్రాచ్యము నుండి పశ్చిమము, పశ్చిమమునుండి ప్రాచ్యము నేర్చుకొనవలసినదెంతో యున్నది. ఈ రెండు ఆదర్శములను చక్కగా మేళవించి భవిష్యత్తు రూపొందించబడవలయును. అప్పుడు తూర్పు లేదు, పడమర లేదు. ఉండునది ఒకే మానవజాతి.

ఈ కాలమున జరిగిన ముఖ్యవిషయము ఉత్తర కాలిఫోర్నియాలో శాంతి ఆశ్రమమేర్పరచి దానిని తురీయానందస్వామి ఆధ్వర్యమున నుంచుట, శాన్ ఫ్రాన్సిస్కోలో వేదాంత సొసైటీ నేర్పాటు చేయుట. పిమ్మట అనేక నగరములలో ఉపన్యసించి ప్యారిసు, హంగేరి, రుమేనియా, సెర్బియా, బల్గేరియా దర్శించి ఏథెన్సు, కైరో వెళ్ళెను. మనస్సులో ఏదో ఆందోళన కలిగి 1900 డిసెంబరు 9 న ఎవ్వరికి తెలియకుండ అకస్మాత్తుగా భారతదేశమునకు వచ్చెను. కెప్టెన్ సేవియర్ మరణమే ఆ ఆందోళనకు కారణము. తక్షణమే ఆయన మాయావతికి వెళ్ళి సేవియర్ సతిని

ఓచార్చెను. అద్వైతాశ్రమ వాతావరణము ఆయనకు ఆనందము కల్గించుటచే రెండు వారము లచ్చట యుండెను.

బేలూరు తిరిగి వచ్చిన తర్వాత తల్లి భువనేశ్వరీదేవితోకూడ అస్సాముందలి నంగల్ బంద్, కామాఖ్య, షిల్లాంగు మొదలగు యాత్రాస్థలములను దర్శించి, 1901 మే నెలలో మఠమునకు తిరిగి వచ్చెను. మఠములో నున్నప్పుడు అధ్యయనము, అధ్యాపనము, ఆధ్యాత్మికబోధ మొదలగునవి చేయుచు నిశ్చింతగా కాలము గడిపెను. ధర్మకర్తల సంఘమును నేర్పరచి, బేలూరు మఠముతో సహా తన పేరుతో యున్న ఆస్తినంతయు సోదర శిష్యులకు సంక్రమింపజేసి సామాన్య విధుల నన్నింటి నుండి విడివడెను.

1901 లో జపాను రమ్మని బౌద్ధవిద్వాంసులు వచ్చినను తన జీవితాంతము సమీపించుచున్నదని స్వామి గుర్తించుటచే వారి కోర్కెను అంగీకరింపక బుద్ధగయ వరకు వెళ్ళి వచ్చెను. వారణాసిలో యువకులు కొందరు స్వామి సందే

శముచే ఉత్తేజితులై పేదలకు, అనాధలకు సేవ చేయుటను చూచి స్వామి ఆనందించెను.

చివర చేసిన పనులన్నియు ఆయన ముందుగా తీర్మానించుకొనినవి. భావగర్భితములు. విశాల వృక్షచ్ఛాయలో చిన్న మొక్కలు ఎదిగిరావని ఆయన వ్యక్తపరచెను. 1902 జూలై 4 వ తేదీ ఉదయం 8-11 గం॥ వరకు ధ్యానము చేసెను. మధ్యాహ్నము ప్రేమానందస్వామితో వాహ్యాళికేగి వేదపాఠశాల స్థాపనను గూర్చి తన ఉద్దేశ్యము తెలిపెను. సాయంత్రము తన గదిలోని కేగి ఒక గంటకాలము ధ్యానము చేసి, తరువాత ప్రశాంతముగా పరుండి రెండు నిట్టూర్పులు విడచి శాశ్వతముగా విశ్రాంతి గొనెను.

భౌతిక కాయమును వదలినను ఆయన అమృతత్వమును ఆయన వ్రాసిన యీ క్రింది మాటలు జ్ఞప్తి చేయును.

“జీర్ణమైన అంగీని తీసిపారవేసినట్లు నా శరీరము నుండి నేను బయట కేగుట మంచిదిగా నాకు కన్పింపవచ్చును. కాని నేను పని

నుండి విరమింపను. ఈ జగత్తు భగవంతుని కన్న వేరు గాదని తెలియువరకు అన్ని ప్రదేశములలోను మానవులను ఉత్తేజపరతును.''

ఓం శాంతిః శాంతిః శాంతిః

— o —

# 2. విశ్వాసము, బలము

తనయందు తనకు నమ్మకము లేనివాడు నాస్తికుడు. దేనియందు నమ్మకము లేనివాడు నాస్తికుడని ప్రాచీన మతములు పలికినవి. స్వశక్తి యందు విశ్వాసము లేనివాడు నాస్తికుడని నవీన మతము చెప్పుచున్నది.

ఆత్మవిశ్వాసము గల కొందరు వ్యక్తుల చరిత్రమే ప్రపంచ చరిత్ర. ఆ విశ్వాసము వ్యక్తిలోని దివ్యత్వమును వెలికి తీయును. మీరు దేనినైనను సాధించగలరు. అఖండ శక్తిని ప్రదర్శించుటకు వలయు ప్రయత్నము చేయని సమయమునందే మీకు అపజయము కలుగుచున్నది. ఒక వ్యక్తిగాని, జాతిగాని తన యందు తనకు విశ్వాస మెప్పుడు కోల్పోవునో అప్పుడే ఆ వ్యక్తిగాని జాతిగాని మరణించినట్లు భావింపవచ్చును.

విశ్వాసము, విశ్వాసము, మనలో మనకు ఆత్మవిశ్వాసము భగవంతునిలో విశ్వాసము—ఇదియే గొప్పతనమునకు మూలరహస్యము. మీ ముప్పది మూడుకోట్ల పౌరాణిక దేవతల లోను మీకు విశ్వాసమున్నప్పటికి, అంతేకాక అప్పుడప్పుడు అన్యదేశీయులు మీ మధ్య చొప్పించుచు వచ్చుచున్న దేవత లందరి యందును మీకు నమ్మక మున్నప్పటికిని—మీలో మీకు ఆత్మవిశ్వాసము లేనిచో మీకు నిష్కృతి లేదు.

ఆత్మకు సాధ్యము కానిది ఏదయినను ఉన్నదని యెన్నటికి తలంపకుము. అట్లు ఊహించుట గొప్ప పొరబాటు. పాపము అనునది ఏదయినను ఉండినచో అది—నీవు దుర్బలుడవని, లేదా ఇతరులు దుర్బలులని—వచించుటే. ఇంతకు మించి పాపము మరొకటి లేదు.

మిమ్ములను మీరే విధముగా భావించుకొందురో ఆ ప్రకారముగా మీరు కాగలరు. బలహీనులుగ మిమ్ము మీరు భావించుకొన్నచో మీరు బలహీనులే అగుదురు; బలవం

యుతులుగా మిమ్ము మీరు తలచినచో మీరు బలవంతులే కాగలరు.

స్వతంత్రులుకండు. ఎవనినుండియు ఏమి యును ఆశింపకుడు. ఒక్కసారి మీరు మీ జీవితములను సింహావలోకనముగావించి చూచి నచో, ఏనాడును మీరు లభించియుండని అన్య సహాయమునకై వృథాగా మీరు శ్రమనంది నట్లు తెలిసికోగలరు. ఇది నా నమ్మకము. మీరు లభించిన సహాయమంతయును మీలో నుండియే మీరు లభించినది.

“కాదు”, “నాచేత కాదు” అని యెన్నడు ననవద్దు. మీరు అనంతశక్తిమంతులు. మీ ప్రకృతితో పోల్చినపుడు కాలము, ప్రదేశము సహితము పోదిలోనికిరాని అల్పవిషయములే. మీరు సర్వశక్తిమంతులు. ఏపనినయినను సరే-ప్రతి కార్యమును మీరు నెరవేర్చగలరు.

భగవంతుని బిడ్డలే మీరు. అమృతానంద భాగస్వాములైన మీరు పవిత్ర పరిపూర్ణ జీవనులు. భువిపై నవతరించిన దేవతాత్మలే మీరు. అట్టి మీరు పాపులా! మానవుని పాపి యనుటయే అన్నిపాపములకు మించిన మహా

హాసము. మానవ ప్రకృతి మీాది, మహా దూషణవాక్యమిది. ఓ సింహసదృశులారా! లేచిరండు. మేకల మందమాదిరి బలహీనులమను భ్రాంతిని మీరు పరిత్యజింపుడు. మీరు శాశ్వత పరమానందానుభవ రూపులయిన అమృతాత్ములు, స్వేచ్ఛాజీవులు.

పోరాటములను, పొరపాట్లను ఎన్నడూ పట్టించుకొనవద్దు. ఆవు ఎన్నడయిన నసత్యము పల్కిన సంగతి నేను వినలేదు. కాని — అది ఆవు మాత్రమే అయినది కాని, మానవుడెన్నటికిని కాజాలడు. అందుచే, ఈ అపజయములను వెనుకంజలను పట్టించుకొనవద్దు. శతసహస్రధా మీా ఆదర్శముతో అంటిపెట్టుకొని యుండుడు. మీా ప్రయత్నమున ఒక వేయిపర్యాయములు అపజయమందినను సరే, పట్టు విడువక మరియొక పర్యాయము ప్రయత్నమొనరింపుడు.

బలహీనతకు పరిహారము దానిని గురించి సత్యము చింతించుట కానేరాదు. బలమును గురించి భావించుటే బలహీనతకు తగినమందు. మానవులలో ఇతఃపూర్వమే అంతర్నిహితముగ నున్న బలమును గూర్చి వారికి బోధింపుడు.

ఒక ఫిరంగి మాదిరిగా ఉపనిషత్తుల నుండి వెలువడి అజ్ఞానద్రవ్యరాశిపై ఫిరంగిగుండు మాదిరిగా వర్షించి అజ్ఞానమును నాశన మొనర్చుమాట — నిర్భయత్వము. మీరు జాగ్రత్తగా గమనించిన ఈ సత్యము బోధపడును.

మీరు జాగ్రత్తగా గమనించినచో నేను ఉపనిషత్తులను మించి అన్యమేదియు నుదహరింపలేదని గుర్తింపగలరు. ఆ ఉపనిషద్బోధనలలోను నేను ప్రవచించిన ఒకే ఒక భావన – బలము అను భావమే. వేదవేదాంతములన్నిటి యందలి సారాంశము ఆ ఒక్కమాటయందే ఇమిడియున్నది.

ఓ నా యువమిత్రులారా! మీరు బలవంతులై యుండుడు. ఇదే నేను మీ కొసంగు సలహా. బలహీనులుగా పడియుండి భగవద్గీతను పారాయణ మొనరించుటకన్నను, ఫుట్‌బాల్ ఆటనాడి బలము నార్జించుటద్వారా స్వర్గమునకు మీరు మరింత చేరువ కాగలరు. ఈ మాటలు సాహసంతో పలికిన మాటలే. అయినప్పటికిని, నేను మిమ్ముల నెంతగనో

ప్రేమించుచున్న కారణమున ఈ మాటలు చెప్పవలసి వచ్చినది. కోప మెచ్చట నున్నదో నాకు తెలియును. కొంత అనుభవమునుకూడ నే నార్జించియున్నాను. మీ దండలను, కండలను ఒకింత బలవత్తరము గావించుకొన్నచో భగవద్గీతను మీరు మరింత చక్కగా అర్థము చేసికొనగలరు.

ప్రతి మనిషిని నేనొక ప్రశ్న వేయుదును. అది—"నీవు బలముగా నున్నావా? బలముగల వాడవని నీవు భావించుకొనుచున్నావా?" ఏల ననగా, బలము నొసంగఁజాలునది సత్యము మాత్రమేనని నాకు తెలియును...ఈ ప్రపంచ రుగ్మతకు సరియైన మందు బలమే.

ఒక మహత్తర యథార్థమిది—

బలమే జీవనము, బలహీనతయే మరణము.

బలమే సంతోషము, శాశ్వతము అమృతము అయిన జీవనము.

బలహీనతయే యెడతెగని ప్రయాస, దుఃఖము.

బలహీనతయే మరణము.

విజయము సాధించవలెనన్నచో మీరు అద్భుతమైన పట్టుదలను, అద్భుతమయిన సంకల్ప బలమును కల్గియుండాలి. పట్టుదలను కలిగిన వ్యక్తి "నేను సముద్రమును ఆపోశన పట్టగలను. నా సంకల్పమాత్రమున కొండలు విరిగి ముక్కలై నా పాదములచెంత పడగలవు" అని ప్రకటించును. ఆ విధమయిన సంకల్పబలము ఆ విధమయిన శక్తిని కలిగి యుండుము; కష్టపడి పనిచేయుము. మీరు మీ గమ్యమును తప్పకుండ చేరగలరు.

మనుష్యులు, మనుష్యులు, వీరే అవసరమై యున్నారు. మిగిలినదంతయు సిద్ధముగా సమకూరగలదు. కాని; బలమయిన, ఉత్సాహవంతులయిన, శక్తిమంతులైన, జీవశక్తితో నుట్టిపడుచుండెడి, విశ్వాసపరులైన యువకులు— అత్యంత నిజాయితీపరులైనవారు కావలసి యున్నారు. అట్టివారు ఒక్క వందమంది లభించిన చాలును, ఈ యావత్ప్రపంచమును గొప్ప మార్పు చెందగలదు.

ఈ దేశమున భేరీలు తయారగుటలేదా యేమి! తూర్యవాద్యములు, ఢంకా నగారాలు

భారతదేశంలో లభించుటలేదా యేమి? ఈ వాద్యములనుండి జనించిన గంభీరఘోషణ నాదములను మన పిల్లలను విననిండు. ఆసంగి గుణాత్మక సంగీతరూపములను బాల్యమాదిగా విని విని......ఈ దేశమే స్త్రీమయముగా మారినది.

తిని కూర్చొని వృథాగా కాలక్షేపము గావించు అజ్ఞాన జీవనముకంటె మరణమే మంచిది. పరాజయమంది మనుగడ సాగించుట కన్నను రణరంగమున ప్రాణముల నర్పించుటే శ్రేయస్కరము.

రండు. వీరోచితకార్యము నేదయిన నొనరింపుడు. సోదరా, నీవు మోక్షమునందనంత మాత్రమున నేమి మునిగిపోయినది? కొన్ని పర్యాయములు నీవు నరకబంధనముల ననుభవించినను ఏమి లోటు? ''పవిత్రతాపూర్ణులయి, మనసావాచా కర్మణా త్రికరణశుద్ధిగా తా మొనరించు పరోపకార కార్య పరంపరల ద్వారా జగత్తునంతటిని సంతసింప జేయువారు, ఇతరులలోని సౌశీల్యమును పరమాణువంతటి దానినయినను పర్వతమంతగా వృద్ధిచేసి

శ్లాఘించుటద్వారా తమ హృదయములను వికసింపజేసికొనువారును అగు మహాత్ములు కొందరున్నారు'' అను శుభాషిత మసత్యమా?

ప్రతివాడును తన శక్తికొలదియు ఉత్కృష్టముగా శ్రమింపనిదే ఏ కార్యమయినను సాధ్యమగునా? ''క్రియాపరతంత్రుడును, సింహసదృశ ధైర్యహృదయుడు అయిన మానవునే విజయలక్ష్మి వరించును!'' వెనుకకు చూడవలసిన అవసరమే లేదు. ముందుకు సాగిపొమ్ము. అంతులేని శక్త్యుత్సాహములు, ఎనలేని ధైర్యము, మేరమెరుగని ఓరిమి మనకు అవసరము. అప్పుడు మాత్రమే ఘనకార్యములు సాధ్యపడును.

నిరాశ జెందవద్దు. సాగవలసిన బాట కత్తి అంచుమీది నడకమాదిరిగా బహు కష్టసాధ్యము అయినను అధైర్యపడవద్దు. లెండు! మేల్కొనుడు! మీ గమ్యమును చేరుకొండు!

సోదరా! ఏల విలపించెదవు? రోగముగాని, చావుగాని నీకు లేనేలేవు. ఏల విలపించెదవు సోదరా! దైన్యముగాని దురదృష్టముగాని నీకు లేనేలేవు. సోదరా! ఏల విలపింతువు? పరిణా

మముగాని మరణముగాని నీకు నిర్దేశింపబడ లేదు. శుద్ధసత్త్వమే నీవు...నీ నిజప్రకృతిని ఎరింగి అట్లు ప్రవర్తింపుము.

జనసామాన్యము నిన్నేమయిన అననీ. నీ దృఢనిశ్చయమునే అంటిపెట్టుకొని యుండుము. అట్లయినచో కావలసినదంతయు తప్పక లభించును. యావత్ప్రపంచమును నీకు పాదాక్రాంత మగును. "ఈతనిలో విశ్వాసముంచుము" లేదా "అతనిలో నమ్మక ముంచుము" అని కొందరందురు. కాని నేను మాత్రం "నీలో నీవు విశ్వాసముంచుకొనుము" అని అంటాను. అదీ సరయిన పద్ధతి. నీలో నీవు ఆత్మవిశ్వాసమును పెంపొందించుకో—శక్తి అంతయు నీలోనే యున్నది—అది గ్రహించి నీలోనున్న ఆ శక్తిని వెలికి తీసికొని రమ్ము. "ప్రతి పనిని, ఏ కార్యము నయినను నేను సాధించగలను" అని ప్రకటింపుము. "నీవు గనుక ఆత్మవిశ్వాసముతో దృఢముగా త్రోసిపుచ్చగల్గినచో పామువిషము నయితము నిన్నేమియు చేయలేదు."

నేను వారణాసి క్షేత్రమున సంచరించు సందర్భమున జరిగిన సంఘటన యిది:

ఒక ప్రక్కన పెద్ద నీటితటాకము, రెండవ ప్రక్క ఒక ఎత్తయిన గోడ గల ప్రదేశము గుండా నేను సాగిపోవుచుంటిని. ఆ త్రోవన వానర సంచారము మిక్కిలి యెక్కువ. కాశీ లోని కోతులు ఆకృతిలో చాలా పెద్దవి. అప్పుడపుడు వాటికి విపరీతమయిన ముక్కోపము కూడ వస్తుంటుంది. వాటి స్వాంతమయిన ఆ మార్గముగుండా నన్ను సాగనీయరాదని అవి నిశ్చయించుకొన్నాయి. పెడబొబ్బలతో అరచుకొంటూ కేకలువేస్తూ వచ్చి, నేను మరి ముందుకు సాగుటుంపగా వచ్చి నా పాదములు పట్టుకొన్నాయి. అవి నా చెంతకు రావడం చూసి, నేను పరుగులు పెట్టసాగాను. నేను ఎంత త్వరగా పరుగెడితే అంతకంటె ఎక్కువ వేగంగా ఆ మర్కటములు నన్ను సమీపించి కరవనారంభించెను. వాటి బారినుండి తప్పించుకొనుట అసాధ్యమే అనిపించింది. కాని, అంతలోనే ఒక ఆగంతకుడు నన్నుద్దేశించి యిట్లు పలికెను: "మృగము నెదుర్కొ." వెన్వెంటనే

నేను వెనుకకు తిరిగి ఆ వానరముల కెదురు నిలచాను. దానితో వెంటనే ఆ మర్కటము ఆగిపోయి, చివరకు వెనుకకు పలాయనం గావించ మొదలిడినవి. జీవితాని కంతటికి ఇది ఒక చక్కని గుణపాఠము—ఎంతటి భయంకర పరిస్థితివయినను సరే ఎదిరించి నిలు, ధైర్యముగా ఎదుర్కొని నిలు.

లేచి నిలబడి ధైర్యముగా పోరు సలుపుము. ఒక్క అడుగయినను వెనుకంజ వేయకు. అదీ ఉద్దేశ్యము. ఏమయినను రానిమ్ము, కానిమ్ము—పోరాడుము. గ్రహతారకలు గతులు తప్పనీ. జగత్తంతయు మనకెదురు నిలచిన నిలుచు గాక! మరణ మనగా కేవలము వస్త్రమును మార్చుట వంటిది మాత్రమే. దానిని సరకు చేయనేల! ఆ ప్రకారం నిర్భయముగా పోరాటం సాగించు. పిరికివాళ్ళుగా అగుటచే సాధించగల్గినదేమియును లేదు. ఒక అడుగు వెనుకకు వేసినందున విపత్తును తప్పించుకొనజాలవు. ప్రపంచములోని దేవుళ్ళందరకును మొరపెట్టుకొని యున్నావు గదా, అందుచే నీ దుఃఖమేమయినా కడతేరినదా!......నీవు

విజయము సాధించిన పిమ్మట నీకు సాయపడుటకై దేవతలు అప్పుడు దిగివస్తారు. దాని వలన ఉపయోగ మేమి! ఇదంతా ఒక పాచిక లాట, జనన మరణాలు లేని అనంతమయిన ఆత్మవే నీవు. అనంతమయిన ఆత్మస్వరూపుడ వయినందున బానిసగా జీవించుట నీకు తగని పని. లెమ్ము. మేల్కొనుము. ధైర్యముగ నిలచి పోరాడుము!



# 3. మానసిక శక్తులు

ఒకే భావమును గైకొనుము. నీ జీవితమును ఆ యొక్క భావముగా తీర్చిదిద్దుము. దానినే తలపోయుము. దానినే కలగనుము. ఆ భావములోనే జీవించుము. నీ మెదడు, కండరములు, నరములు శరీరములోని ప్రతి భాగమును ఆ భావములోనే లీనము కానిమ్ము. కార్యసిద్ధికిదే మార్గము. మనము ధన్యులమై ఇతరులను ధన్యులను చేయదలచితిమేని మనము మరింత లోతుగా ఆలోచింపవలయును. లోతుగా జీవింపవలయును.

గొప్ప ప్రపంచ ప్రవక్తలు, సాధుపుంగవులు, సత్యదర్శకులు అందరూ చేసిన దేమి? మానవజాతి జీవితమునంతయు వారు తమ జీవిత పరిమితిలోనే జీవించిరి. సామాన్య మానవులకు పరిపూర్ణత్వము బడయుటకు అవసర

మగు దీర్ఘకాలమును వారు త్వరలోనే దాటిరి. ఒక్క జన్మలోనే వారు తమను తాము పరిపూర్ణుల నొనర్చుకొనిరి. వారికి మరి ఏ యితర ఆలోచన లేదు. ఒక్క క్షణము కూడా వారు అన్యభావములకు చోటివ్వలేదు. ఆ విధముగా వారికి చేరవలసిన గమ్యము సన్నిహితమయ్యెను. ఏకాగ్రత అనగా భావములను జీర్ణించుకొను శక్తిని వృద్ధిపరచుకొనుచు, కాలమును తగ్గించుకొనుటయే.

జ్ఞానసంపాదనకిది ఒకే ఒక పద్ధతి. కాన, ఏకాగ్రశక్తి ఎంత ఎక్కువగా నుండునో అంత ఎక్కువగా విషయజ్ఞానము ఆర్జింపబడును. చెప్పులు తుడుచువాడు కూడా ఎక్కువ ఏకాగ్రతతో పనిచేసినచో, మరింత చక్కగా పాలిషు చేయగలడు. ఏకాగ్రత గల వంటవాడు మరింత రుచిగా వంట చేయును. ధనార్జనలోగాని, దైవార్చనలోగాని లేక ఏ యితర కార్యాచరణలోగాని ఏకాగ్రశక్తి ఎంత బలీయమగునో కార్యసిద్ధి అంత బాగుగా సమకూడును. ప్రకృతి ద్వారములు తెరచి కాంతి

ప్రవాహములో వెల్లుబికించు నట్టి పిలుపు ఈ ఏకాగ్రతయే.

మానసిక శక్తుల ఏకాగ్రతచే కాక జగత్తు నందలి విషయజ్ఞాన మంతను ఎట్లు సాధింప బడినది! జగత్తును ఎప్పుడు, ఎట్లు వ్రేటు వేయవలయునో, ఎట్లు భేదించవలయునో తెలిసినచో, అది దాని రహస్యములను బయట పెట్టుటకు సిద్ధముగా నున్నది. వ్రేటునకు కావలసిన బలము, వీర్యము ఏకాగ్రతవల ననే కలుగుచున్నవి. మానవుని బుద్ధిబలమునకు పరిమితియే లేదు. అది ఎంత ఎక్కువగా ఏకాగ్రత మొనర్చబడినచో అంతగా అధిక శక్తిని ఒకే విషయముపై మోపును. అదియే రహస్యము.

ఏ శక్తినైనను మరలించవచ్చునే గాని సృష్టించలేము. మన వశమందున్న మహత్తర శక్తులను స్వవశ మొనర్చుకొనుటను నేర్వవలయును. మనో నిగ్రహముచే వానిని పాశవిక మొనర్చక ఆధ్యాత్మికముగా మరల్పవలయును. నీతికి, మతమునకు పవిత్ర శీలమే పునాదిరాయి యని విస్మరింపరాదు.

ఒక్క క్షణమైనను మన మనస్సులను నిగ్రహింపలేని మనము, ఒక విషయముపై నైనను మనస్సును నిలుపజాలని మనము, అన్యాధారమేమియు లేక ఒక్క విషయముపై బుద్ధి నిలుపలేని మనము స్వతంత్రుల మెట్లగుదుము? ఐనను మనము స్వతంత్రుల మనియే చాటుకొందుము. ఆలోచింపుడు! నిగ్రహము లేని మనస్సు మనలను క్రిందికి క్రిందికి లాగి చీల్చి చెండాడును. నిగ్రహింప బడిన మనస్సు మనలను సంరక్షించును; మనలను స్వతంత్రులను చేయగల్గును.

మనుష్యులకు, పశువులకు గల ముఖ్య భేదము ఏకాగ్రతలోని భేదము. ఏ పనిలో గలిగిన విజయమైనను దీని పర్యవసానమే. ఏకాగ్రతలోని భేదమే మనుష్యునకు మనుష్యునకు గల భేదాను నిర్ణయించుచున్నది. అధమ స్థితిలో నున్న మానవుని, ఉన్నతస్థితిలో నున్న మానవుని పోల్చిచూడుము. వారి ఏకాగ్రతలో గల భేదమే వారి మధ్య గల అంతరమునకు కారణము.

సామాన్య మానవుడు తన ఆలోచనా శక్తిని నూటికి తొంబది తొమ్మిదిపాళ్ళు వృథా చేయుచున్నాడు. అందుచే అతడు తరచుగా పొరబాట్లు చేయుచున్నాడు. సుశిక్షితుడైన మానవు డెప్పుడును తప్పు చేయడు.

ప్రపంచములో పిరికిగుండె గల వారినుండి మన మాశింపగల కార్యమేముండును? బొత్తిగా శూన్యము. మహాసముద్రమును దాట దలతువేని నీకు వజ్ర సంకల్పముండి తీరవలయును. కొండలను పిండి చేయజాలు నంతగా శక్తి మంతుడవు కావలయును.

తలంపులు మంచివే కానిండు, చెడ్డవేని కానిండు. వానిలో ప్రతిదీ శక్తివంతమైనదే. అవి జగత్తునంతయు ముంచెత్తి వేయును. స్పందన శక్తివలె అవి శక్తిమంతములు. కార్య రూపము దాల్చువరకు ఆలోచన, ఆలోచనా రూపములోనే యుండిపోవును. ఉదాహరణకు మానవుడు చేతితో ఒక దెబ్బ కొట్టి చైతన్యము కలిగించువరకు ఆ శక్తి అతని చేతి యందు అంతర్గతముగా నుండును.

మంచి, చెడు తలంపులకు మనము వారసులము. మనము పరిశుద్ధులమై మంచి తలంపులకు తగిన పనిముట్లుగా మారినచో అవి మనలో ప్రవేశించి ఘనకార్యములను సాధించును: చెడు తలంపుల కవి తావివ్వవు.

మానవజాతి చరిత్రలో భగవదాదేశకు లుద్భవించుచున్నారని మీకు తెలియును. వారు ఉద్భవించిన తోడనే వారి ఉద్యమము నిర్ణయింపబడి ఏర్పడి యున్నది. విధానమంతయు నియామకమై యుండుటను, వారు దానినుండి ఇసుమంతయు చలింపకుండుటను నీవు గుర్తించియే యుందువు. వా రొక ఉద్యమమునకై ఉద్భవించుటచే వా రొక సందేశమును వెంటగొనివత్తురు. వారెప్పుడు మాటలాడినను, వారి ప్రతిమాట ఫిరంగి గుండువలె సూటిగా తగులును. శక్తిప్రేరితముగాని మాటకు విలువ ఏమున్నది! నీవు ఏ భాషలో మాటలాడిన నేమి! వాక్యముల నెట్లు మార్చిన నేమి! ఛందోబద్ధమైన నేమి! లేక అలంకారిక మైన నేమి! నీవు మాటలాడిన భాష పదగుంభిత మైన నేమి! కాకున్న నేమి! నీ కిచ్చుటకు సందేశ మేమైన

యున్నదా? లేదా? అనునదే సమస్య. ఇచ్చి పుచ్చుకొనుటయేగాని, వినుటగాదు.

నీ కిచ్చుట కేమైనా గలదా? అనునది యొకటి ప్రశ్న. నీకేదైన యున్నచో దాని నిమ్ము.

నీ వే యొనర్చినను నీ మనస్సును, సర్వ శక్తిని దానికై వినియోగించుము. నే నొక సారి ఒక గొప్ప సన్న్యాసిని దర్శించితిని. పూజా పునస్కారముల యందును, ధ్యానమునందును ఎంత శ్రద్ధ వహించునో, అంత శ్రద్ధతో ఆయన తన ఇత్తడి పాత్రలను బంగారు పాత్రల రీతిని నిగనిగలాడునట్లు తోమును. శ్రద్ధయున్న ఆ రీతిగా యుండవలెను. అట్టి శ్రద్ధను, ఏకాగ్రతను ప్రతి మానవుడు పొందగలిగినచో మానవ జాతి మనుగడ మహోన్నత మార్గమును బట్ట కలదు.

ఈ జీవితమును కొనసాగించుచునే మనము పవిత్రతను బడయుట యెట్లు? పవిత్రతను సముపార్జించుటకై మనమందరమును అడవులలోని గుహాలలోనికి పోవుదమా? అట్లు పోవుటవలన

మనకు ఏమి మేలు చేకూరగలదు? మనసే గనుక మన అధీనమునందు లేని పక్షమున మనము గుహాలలోనికిపోయి ఏకాంతవాస మొనర్చినను ప్రయోజన ముండదు. అచట కూడ అదే మనస్సు మనలో అన్ని రకాల అలజడులను సృష్టించును. అన్ని రకముల భూతములును మన మనసునందే యున్న కారణమున మనము ఏకాంతమునకై గుహాంతర్భాగమున కేగినను అచటికి సైతము ఆ భూతములే ప్రత్యక్షమగును. మన మనసే గనుక మన అధీనమం దున్నచో మనం ఎచ్చటకు వెళ్లినను, ఎక్కడున్నప్పటికిని అచ్చటనే ఏకాంతము మనకు లభించును,

ఈ ప్రపంచము మనకగుపించెడి తీరు మన మానసిక పరిస్థితి మీద ఆధారపడియుండును. ఈ ప్రపంచము మన యెడల నెట్లున్నదని మనము తలంచుచున్నామో, ఆ భావనను రూపొందించునది మనయొక్క స్వకీయ మానసిక దృక్పథము మాత్రమే. వస్తువులను అందముగా అగుపింపచేయునవి మన భావనలే.

వస్తువులను అందవికారముగా కనుపింప జేయునవి మన భావనలే.

ఈ ప్రపంచమంతయు మన మనసునందే ఇమిడి యున్నది. అందుచేత సమ్యక్‌దృష్టిని అలవరచుకొనండి.

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్."



# 4. మానవుడు-తన కర్మకు తానే కర్త

మహమ్మదు ప్రవక్త మంచివాడయినందున గాని, బుద్ధుడు మహామనీషి అయినందునగాని- అందువలన నా కొరిగిన దేమి యున్నది? వారు మంచివారగుట నా యొక్క మంచితనమును గాని, చెడునుగాని ఏమైనా మార్పు చేసినదా? ఇంతకు ముందు కొంతకాలం క్రిందట ఎవరో ఒకరు మంచివారయినందున మనము మంచి వారగుట కాదు కావలసినది. మన స్వంత బాధ్యత మీదనే, మన స్వీయప్రయోజనము నాకాంక్షించి మనకు మనముగా మంచివార మయ్యెదము గాక!

ఇప్పుడు మనమున్న ప్రస్తుత స్థితికి మనమే బాధ్యులము. ఏమి కావలెనని మనము అభిలషించెదమో ఆ ప్రకారముగా మనలను మనము రూపుదిద్దుకొనగలము. ఆ సామర్థ్యము మన కున్నది. ఇప్పుడు మనమున్న వర్తమాన

స్థితికి మన పూర్వ కర్మలు కారణమైనచో అదే హేతువుననుసరించి, మనము ఆశించిన విధముగ మన భవిష్యత్తును ప్రస్తుత కర్మల ఫలితముగా మనము రూపొందించుకొన వచ్చును. అందుచే, మనము ఏ తీరున నడచుకొనవలయునో గుర్తించుకొని ప్రవర్తింప వలసి యున్నది.

విశ్వమంతటిలోను ఉత్తమోత్తమ మయిన శరీరము ఈ మానవ దేహమే. మానవుడే సర్వోత్తమ జీవి. అన్ని జంతువుల కన్నను, దేవతలకంటెను మానవుడే ఉన్నతుడు. అతని కంటె అధికు లెవ్వరును లేరు.

ప్రకృతి నధిగమించుటకయి పోరు సలుపు చుండినంత కాలమును మానవుడు మానవుడే. ఆంతరికము, బాహ్యము నని యీ ప్రకృతి రెండు తెరగులు.........వివిధ జాతుల చరిత్రను గనుక సునిశితముగా మనము పరిశీలించినచో—ప్రకృతి నెదిరించి పోరు సలుపు మానవుల సంఖ్య అధికముగనున్న సందర్భములలో జాతి యున్నతి నందుకొన్నట్లును, అనంతత్వము నందుటకై ఈ పోరాటము ననుసరించుట అగి

పోయినపుడు జాతి పతనము ఆరంభమయినట్లును మనకు తెలియవగును. [ప్రయోజనవాదులు ఈ పోరాటము నిరర్థకమని తృణీకరించిన తృణీకరించెదరు గాక, మన కది అనవసరము] అనగా, ప్రతి జాతికిని బలము దాని ఆధ్యాత్మికత యందే నిబిడీకృతమై యుండును. ఈ ఆధ్యాత్మికత క్షీణించి, భౌతిక వాదము పాదుకొన నారంభించిన యంతనే ఆ జాతి వినాశము ఆరంభమయినదన్నమాట.

మరింత శక్తిమంతులముగా మనలను మనము తీర్చి దిద్దుకొను నిమిత్తము మన మేతెంచిన ఒక గొప్ప వ్యాయామశాలయే ఈ ప్రపంచము.

ఆరోగ్యకరమయిన సాంఘిక పరిణామము లన్నియును అంతర్గతముగా పని చేయుచున్న ఆధ్యాత్మిక శక్తుల ప్రకటనమే. ఈ ఆధ్యాత్మిక శక్తులే గనుక బలీయముగా నుండి సక్రమముగా సర్దుబాటయినచో దానికి అనువుగా సంఘము తనను తానే తీర్చిదిద్దుకొనును. ప్రతి వ్యక్తియు తనకు తానే స్వీయమోక్షమునకై పాటు పడవలెను. అంతకు మించి మరియొక దారి లేదు.

జాతుల విషయమున కూడ ఇదే న్యాయము వర్తించును.........అన్ని వ్యవస్థలును అసమగ్రములే. పరిపూర్ణ సమగ్రవ్యవస్థ ఒక్కటియు లేనే లేదు. ఆ కారణమున వ్యవస్థలయందలి లోపాలను వేలెత్తి చూపించుట చాల సులభమయిన పని. ఒక వ్యవస్థ ఎట్టిదయినప్పటికి ఆ వ్యవస్థయందు మనుగడ సాగించుచున్న వ్యక్తిలోని అసమగ్రతల నధిగమించుటకు తోడ్పడునట్టివాడే మానవాళికి నిజమయిన మహోపకారి. వ్యక్తులే గనుక సముద్ధరింపబడినచో జాతియు, ఆ జాతికి చెందిన వ్యవస్థలును తప్పక సముద్ధరణ మొందగలవు.

సర్వసాధారణముగా మనుజులు తమ దోషాలను సాటివారిపయిన నెట్టి వేయుచుందురు. అట్లు ఇతరులపయి నెట్టివేయుటకు వీలుగాని పక్షమున ఆ నెపమును దైవము మీదనో లేదా తాము సృష్టించిన విధివ్రాతయను భూతముపైననో నెట్టివేయుదురు. విధియనునది ఎక్కడుంది! విధి యనగా నెవరు! ఎవరు చేసినకర్మ వా రనుభవింపక తప్పదు. మన విధిని రూపొందించుకొనునది మనమే.

అందుగూర్చి దూషణ భూషణములకు అన్యుల కెవ్వరికిని సంబంధము లేదు. గాలి వీచు చున్నది. తమ తెరచాపలనెత్తియుంచుకొన్న పడవలు ఆ గాలి వాటున తమ ప్రయాణం సాగించి ముందుకు సాగిపోవును. కాని, తమ తెరచాపలను ముడుచుకొని కూర్చున్న పడవలు ఆ గాలివలన లాభమునంద లేవు. మరి ఆ దోషము గాలి దగునా!

"నేననుభవించుచున్న ఈ దుఃఖమంతయూ నా కర్మఫలితమే. అందుచే దానిని తొలగించుట కూడ నాచే మాత్రమే జరుగవలెను" అనుచు పలుకుడు. నేను కట్టినదానిని నేనే పడగొట్టగలను. ఇతరు లెవరో నిర్మించినదానిని మాత్రము నేను నిర్మూలింపజాలను. అందుచే— లెండు. ధైర్యము వహింపుడు, బలవంతులు కండు. బాధ్యత నంతటిని మీ భుజ స్కంధములపై వేసికొనుడు. మీ భావికి మీరే కారకులు అని తెలిసికొనుడు. మీకు కావలసిన బలము, సహాయము అంతయును మీలోనే యున్నవి.

మీ స్వీయ భవిష్యత్తును మీరే స్వీయముగా నిర్మించుకొనుడు. గతించిపోయిన దానిని గతమే పూడ్చిపెట్టనిండు. అనంతమయిన భవిష్యత్తు మీ ముం దున్నది. ప్రతి మాట, ప్రతి సంకల్పము, ప్రతి చేష్టయును కొంత సంచిత ఫలమును మీకై మూటగట్టి యుంచును. ఈ విషయమును నీ వెల్లప్పుడును గుర్తుంచుకొన వలయును. దుష్టసంకల్పములు, దుష్టచేష్టలును క్రూరవ్యాఘ్రముల మాదిరిగా నీ పయిన దూకి పడుటకు సిద్ధముగా కాచుకొని యున్న వనియు; సత్యసంకల్పములు, సత్కార్యములును శతసహస్ర దేవతాశక్తితో మిమ్ము కాపాడుట కయి అనవరతము సిద్ధముగా నున్నదనియు దృఢమయిన విశ్వాసముకల్గి ప్రవర్తించెదరు గాక.

"ఎందుకు, ఏల ననుచు ప్రశ్నించుట కాదు' మన కర్తవ్యము—విధిని నిర్వహించుచు ప్రాణముల నర్పించుటయే." ఉత్సాహశీలివై యుండుము. ఘనతర కార్యనిర్వహణకై మనలను భగవంతుడు ఎంపిక జేసినాడనియు, మన మీ కార్యములను తప్పక నెరవేర్పగలమనియు విశ్వసింపుము.

దురదృష్టవశమున, ఈ జీవితమున అత్యాధిక సంఖ్యాకులైన మానవులు ఏ యాదర్శము లేకనే అంధకారమునబడి కొట్టుమిట్టాడుచున్నారు. ఏదయినను ఒక ఆదర్శమును స్వీకరించిన మానవుడు వేయి తప్పుల నొనరించినచో, ఏ ఆదర్శమును లేనిమానవుడు యాభైవేల తప్పులు గావించునని నా నిశ్చయము.

ప్రకృతి నెదిరించి పోరాడుటకై మానవుడు ప్రయత్న మారంభించును. ఆ ప్రయత్నమునందత డనేక పొరపాట్లు చేయును. బాధల ననుభవించును. కాని, క్రమక్రమముగా ఆతడు ప్రకృతిని జయించును. తన స్వాతంత్ర్యమును గుర్తించును. ఆతడు స్వతంత్రుడు కాగానే, ప్రకృతి యాతనికి దాసోఽహమ్మని దానిస యగును.

ప్రకృతికి లోబడియుండుటయే స్వాతంత్ర్యము అనుదానిని నే నంగీకరింపను. అట్లనుటకు అర్థమేమో నాకు తెలియదు. మానవజాతి పురోభివృద్ధిచరిత్ర ననుసరించి ప్రకృతి

నడిపించుటయే ఆ పురోభివృద్ధికి తోడ్పడి యున్నది.

మన జీవితాలు మంచివిగా నుండవలెను. మన జీవితములు పవిత్రముగా నుండవలెను. అట్లున్ననే ప్రపంచము మంచిగా నుండగలదు. ప్రపంచము మంచిగా నుండుట అనునది ఫలితము. దానికి కారణము మనము. కావున మనము మనలను పవిత్రులనుగా రూపొందించు కొందుము గాక, పరిపూర్ణులుగా రూపుదిద్దు కొందుముగాక.

కలహములవలనను, నేరారోపణలవలనను ప్రయోజనమేమి? ఉన్నపరిస్థితిని మెరుగు పరచుటకు మనకది యొంతమాత్రము సాయ పడదు. తనకు తటస్థించిన చిన్న చిన్న పనులను నెరవేర్చుటకై సణుగుకొను స్వభావము గల మనిషి ప్రతివిషయానికి అసంతృప్తుడయి సణుగుకొనుచునే యుండును. ఎల్లప్పుడును సణుగుకొనుచు అసంతృప్తుడగుచుండెడి వాని జీవితము దైన్యమయముగనే గడచును. అట్టి వానికి అన్నింటను అపజయమే ఎదురగును.

తాను చేయవలసిన పనియందు త్రికరణ శుద్ధిగా నిమగ్నమయి, తన విధిని యథా ప్రకారముగా నిర్వహించుకొనిపోవువానికి వెలుగురేఖలతో సరియైన మార్గము గోచరించును. అట్టివానికి మరింత గురుతర బాధ్యతలు సంక్రమించుచుండును.

ప్రపంచమను యంత్రపు చక్రముల క్రింద బడి నలిగిపోవుదుమను వెరపుతో దూరముగా పారిపోకండి. దానిలోపలనే నిలచి కర్మ రహస్యమును తెలియండి. సంసారము నందుండుచునే కర్మాచరణమును సవ్యముగా నొనర్చుట ద్వారా బంధవిముక్తిని బడయజాలుటకును అవకాశమున్నది.

మనము తలపోయు ప్రతి భావనయు, మనము గావించు ప్రతి కార్యమును కొంత కాలము గడచిన పిమ్మట సూక్ష్మరూపమునంది బీజరూపముగా ఆ సూక్ష్మశరీరంలో సుషుప్తావస్థలో జీవించియుంటుంది. మరల కొంత కాలమయిన పిమ్మట అది బయల్వెడలి ఫలితములను చూపించును. ఈ ఫలితములే మానవ జీవిత వైఖరిని నియంత్రితమొనరించుచుండును.

ఈవిధముగా మానవుడు తన జీవితమును తానే స్వయముగా రూపొందించుకొనుచున్నవాడగు చున్నాడు. తన జీవిత గతికి తానై ఏర్పరచు కొన్న నియమాలకు మాత్రమే మానవుడు బద్ధుడు. బాహ్యమయిన ఏ అన్యనియమాల కును అతడు బద్ధుడు కాడు.

నా ఆదర్శము నంతటిని ఒక కొద్ది మాట లలో ప్రకటింపవచ్చును. అది—మానవాళికి దానియొక్క దివ్యత్వమును బోధించుట, జీవి తమునందు ప్రతి చర్యలోను ఆ దివ్యత్వమును ప్రకటించుటయెట్లు అనునది బోధించుట.

పవిత్రత, ఓర్పు, పట్టుదల—వీని అన్నిటిని మించి ప్రేమ: విజయసాధనకు అత్యంతావశ్య కము లివి.

నిత్యవికాసమే జీవనము, సంకోచమే మర ణము. తన వ్యక్తిగత సుఖసంతోషములకు మాత్రమే పాటుపడుచు సోమరిగా జీవించు స్వప్రయోజనపరునకు నరకమునందు సహి తము స్థానం లేదు.

తనకు దైవమిచ్చిన విచక్షణాజ్ఞానమును వినియోగింపక గ్రుడ్డి నమ్మకములను పట్టుకొని

ప్రేలాడు మనిషిని భగవంతుడు క్షమింపడు. అంతకంటె; భగవద్విశ్వాసము లేనివాడే అయినప్పటికిని తన విచక్షణాజ్ఞానమునుపయోగించు వానినే భగవంతుడు క్షమించునని నా దృఢ నిశ్చయము. మంచి చెడ్డలను విచారించితీరాలి. మన విచక్షణాజ్ఞానమును తప్పక వినియోగించాలి. ప్రతిదేశమునందున ప్రాచీన గ్రంథాలు తెలియజెప్పెడి మహాపురుషుల విషయమునను, ప్రవక్తల విషయమునను గల వాస్తవమును హేతువాదము ఋజువు చేసినప్పుడు అట్టివారిని మనం విశ్వసింపగలము. అట్టి ప్రవక్తలను మన మధ్యనే కనుగొన గల్గినపుడు వారిని మనము విశ్వసింపగలము. ఆ ప్రవక్తలు విపరీత వ్యక్తు లేమియు కారని, కొన్ని సిద్ధాంతములకు దృష్టాంతము లేయని అప్పుడు మనము గ్రహింపగలము.

లక్ష్యసిద్ధికొరకయి నీవేల పాటుపడరాదు? అపజయములద్వారానే మనము మరింత జ్ఞానవంతులమగుచున్నాము. కాలము అంతులేనిది. గోడను గమనించు. అది యెన్నడయినను అసత్యమాడి యుండెనా? అంతమాత్రమున

దానికి ఏ విశిష్టతయును సంక్రమించుటలేదు. ఎన్నటికిని గోడగానే అది మిగిలిపోవును. మానవు డబద్ధము పల్కియుండవచ్చును— అయిననేమి! ఆ దోషమును సరిదిద్దుకొని అతడు భగవంతునిగా పరిణమింపగలడు. ఏదో ఒక కార్యమును నిర్వర్తించుట శ్రేయస్కరము. అది తప్పు అయినను నగుగాక. లెక్క చేయకుము. ఏమియు చేయక నూరకే యుండుట కంటె అది యెంతో మేలు. ఆవు ఎన్నడును అసత్యమాడి యెరుగదు. కాని, అది యెప్పటికిని ఆవుగనే మిగిలియుండును. ఏదియో ఒక కార్యము నొనర్పుము!

పవిత్ర భావనలనే నిరంతరము తలపోయుచు సదాసత్కర్మముల నాచరించుచు జీవనము సాగింపుము. నీచమయిన సంస్కారములను అణచియుంచుట కిది యొక్కటే మార్గము. ఒకడు శుద్ధ అయోగ్యుడని యెన్నడును పలుకకుము. ఏలననగా—అతని ప్రస్తుత ప్రవర్తనము అతని అభ్యాసముల ఫలితమేగదా. ఆ అభ్యాసములను నూతన సదభ్యాసములచేత సరిదిద్ద వచ్చును. పునరావృతములయిన అభ్యాసములే

శీలము. పునరావృతమైన అలవాట్లు మాత్రమే శీలమును సంస్కరింపజాలును ...... బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠమయిన బుద్ధి అద్భుతమయిన శక్తియుక్తులను, బ్రహ్మాండమయిన సంకల్పబలమును కలిగియున్నది.

ఎడతెగని సాధనలద్వారా కష్టపరిస్థితిని మనము అధిగమించగలము. ఏదయినను ఒక పరిస్థితి మనకు సంబంధించుటకు మనకై మనము లోబడి అవకాశ మిచ్చిననే తప్ప ఆ స్థితి మనకు సంభవింపజాలదు. ఈ సత్యమును మనం తప్పక తెలుసుకొనవలెను.

ఒక సారి నేను హిమాలయపర్వతములందు సంచరించుచున్నాను. ఎంతో ఎత్తుగా పొడవయిన కాలిబాట మా ముందు కాన్పించుచున్నది. నిరుపేద సన్యాసులము మేము. మమ్ములను మోసికొని తీసుకొనిపోవుటకు కూలీలను నియమించుకొను శక్తిలేని కారణమున కాలి నడకనే ప్రయాణ మంతయు గడుపవలెను. మాతో ఒక వృద్ధుడుండెను... "ఈ మార్గమును గడచుటయెట్లు! నేనింక నెంత మాత్రమును అడుగుతీసి అడుగు పెట్టజాలను.

కాలు కదిపిన నా గుండె బ్రద్దలయిపోవును" అనుచు నాతడు వాపోయినాడు. అంతట నే నాతనికిట్లు ధైర్యము చెప్పి ప్రోత్సహించితిని: "నీ కాళ్ళవయిపొక్కసారి పరికించి చూడు." అపుడతడట్లు చేసెను. అంతట నే నిట్లు పల్కితిని: "నీ కాళ్ళక్రింద కన్పించుచున్న మార్గమంతయు నీవు స్వయముగా నడచి వచ్చిన మాదిరిదే. అతి త్వరలోనే అది కూడ నీ కాళ్ళ క్రింద నుండును." దివ్యనక్షత్రాల మాదిరిగా మీరును దివ్యులయి యున్నారు. కనుక అత్యున్నత వస్తువులు కూడ మీ పాదముల క్రిందనే యుండును. అంతటి మహోన్నత వ్యక్తిత్వము మీది.

పిరికివాడును, పనికిమాలిన కాపురుషుడును మాత్రమే "ఇది విధి వ్రాత" అని పలుకుననుచు సంస్కృత సుభాషితము చాటుచున్నది. కాని, తాను దృఢముగా నిలచి "నా కర్మకు నేనే కర్తను" అని ప్రకటించువాడే ధైర్యవంతుడు. ముసలితనము మీద బడుచున్నవారే విధిని గురించి మాట్లాడు

కారు. యువకులు సాధారణముగా ఔన్నత్యము జోలికి పోరు.

ఒక మనిషి శీలమును నిర్ణయించుటకు అతడు చేసిన ఘనకార్యములను పరిగణింపరాదు. ప్రతి పనికిమాలిన మూర్ఖుడును ఎప్పుడో ఒకప్పుడు మహావీరుడై వెలిగియుండవచ్చును. సర్వసామాన్యమయిన పనులను నిర్వర్తించుచున్నప్పుడు వ్యక్తిని పరిశీలించుము. నిజానికి ఒక మహావ్యక్తి యొక్క వాస్తవ శీలమును తెలియపరచునవి ఈ సాధారణ కృత్యములే. గొప్ప గొప్ప సందర్భములు అత్యంత సామాన్య మానవులకు సయితము ఒకవిధమగు ఘనతను ఆపాదించును. కాని, ఒక వ్యక్తి శీలము ఎల్లవేళలందును—అతడెట్టి పరిస్థితిలో నున్నను ఒకే రీతిగా విశిష్టముగా నున్నచో అట్టివాడు మాత్రమే నిజముగా గొప్పవాడు.

ఏ విధమయిన ప్రతిఫలమును ఆశింపక, మనము ప్రపంచమున కందించిన ప్రతి సద్భావనయును లోకమున పదిలపరచబడి, శృంఖల శ్రేణిలో ఒకదానిని ఛేదించి, కర్మబంధమును సడలించి మనలను మరింత మరింత పవిత్రుల

నొనరించును. మర్త్యులలో అత్యంత పవిత్రులుగా మనము పరిగణించువరకును అవి మనలను మరింత పవిత్రులుగా నొనరించుచునే యుండును.

నీవు గనుక ఈర్ష్యాద్వేషములను వెలిబుచ్చినచో అవి యిబ్బడి ముబ్బడిగనయి వడ్డీతో సహా నీ మీదకే మరలివచ్చి నిన్నుపట్టి కుదుపును. ఏ శక్తియును దానిని ఆపజాలదు. దానికి అవకాశమును నీ వొక్కసారి యిచ్చినచో ఫలితమనుభవించి తీరవలసినదే. దీనిని నీవు గుర్తుంచుకొన్నచో దుష్టకార్యముల నాచరింపకుండ అది నిన్ను నిరోధించును.

ప్రకృతిని ప్రతిఘటించి తిరుగబడునది ప్రతిదియును చైతన్యవంతమే. అట్టి సందర్భములలో చైతన్యము ప్రస్ఫుటమగును. చిన్నచీమ నొకదానిని చంపుటకు ప్రయత్నించి చూడు. ఆ అల్పప్రాణి సయితము తన ప్రాణరక్షణకై వెన్వెంటనే ప్రతిక్రియను చూపించును. ఎక్కడెక్కడ పోరాటమున్నదో, ఎక్కడెక్కడ తిరుగుబాటు గలదో - అచ్చట జీవమున్నదని

గుర్తు. ఆయా తావులలో చైతన్యము ప్రకటిత మగుచున్నది.

ధనము నార్జించునది మానవుడే గదా! ఎక్కడైనను ధనము మానవుని కల్పించినదని వినియుంటివా! నీ తలపులకును చేతలకును గనుక సామరస్యము గల్పింపజాలినచో— మరల మరల నొక్క వక్కాణించుచున్నాను - నీ మాటలు, చేతలు, ఒకే విధముగ నుండిన యెడల, ధనము దానంతట నదియే మంచి నీళ్ళప్రాయముగా నీ పాదముల చెంతకు వచ్చి పడును.

ఈ విశ్వమునందు మంచికిగల మార్గము అత్యంత కష్టసాధ్యమయినది, కఠినమయినది. ఆ మార్గము నవలంబించి ఎందరో అపజయము పాలయినారన్నది ఏమంత వింత సంగతి కాదు. ఎందరెందరో ఆ మార్గమున విజయము సాధించినారన్నదే వింతయిన విషయము. వేలాదిగా తప్పటాట్లు, పొరపాట్లు చేయుటద్వారానే చివరకు సచ్ఛీల స్థాపన జరుగవలసియున్నది.

ప్రతికార్యమును—అవహేళన, ప్రతిఘటన ఆటుపిమ్మట అంగీకారము అను ఈ మూడు

మజిలీలగుండాను సాగిరావలెను. తన కాలము కంటె ముందుకు చూపు సారించి ఆలోచించు ప్రతివ్యక్తియు అపార్థము చేసికొనబడును. తప్పదు. అందుచే ప్రతిఘటనయు, హింసయు ఆహ్వానింపదగినవే. నేను మాత్రము నిదానము గను, పవిత్రముగను నుండి భగవంతునిలో అపారవిశ్వాసమును కల్గియుండవలెను—ఈ ప్రతిఘటన, హింస అన్నియు అదృశ్యము కాగలవు.

ప్రతి ఆత్మయును వస్తుతః దివ్యమయినదే. ఆంతరికమును, బాహ్యమును అయిన ప్రకృతిని నియంత్రితము గావించుటద్వారా ఈ దివ్యత్వమును ప్రకటిత మొనరించుటే లక్ష్యము. కర్మముద్వారానో, భక్తిమార్గముననో యోగసాధనవలననో, వేదాంతజ్ఞానము మూలముననో—వీనిలో ఏదయినా ఒక మార్గము నవలంబించిరో, ఒకటికంటె ఎక్కువ మార్గముల ననుసరించిరో, లేదా అన్ని మార్గములను అనుసరించిరో—ఈ లక్ష్యమును సాధించి ముక్తుడవుకమ్ము. మతసర్వస్వమును ఇదియే. వాదములు, సిద్ధాంతములు, క్రియాకలాప

ములు, శాస్త్రగ్రంథములు, దేవాలయములు, విగ్రహారాధనములు ...... యివి అన్నియును ఆనుషంగికములు మాత్రమే.

ఎవడికివాడు ప్రతివాడును తన మార్గమే సర్వోత్తమమని తలంచును. మంచిదే! కాని ఇది గుర్తుంచుకోండి—ఆ మార్గము మీకు మీ వరకు మంచిదే కావచ్చు. ఒకని కొంతమాత్రమును జీర్ణము గాని ఆహారము మరియొకనికి అతిసులభముగా జీర్ణము కావచ్చును. ఒక పద్ధతి మీకు మంచిదయినందున అందరకూ అదే పద్ధతియని భావించవద్దు. పిడుగుకూ బియ్యానికీ ఒక్కటే మంత్రము కాదు. విద్యావిహీనులు, సంస్కారరహితులు, ఆలోచనాశూన్యులు అయిన వారికి కూడ అందరికీ ఒకే పద్ధతి! అది మంచిది కాదు. మీ స్వంత బుద్ధి నుపయోగించి ఆలోచించండి. నిరీశ్వరవాదులుగా మారినను మారండి; భౌతికవాదులుగ మారిన మారుడు—మీ స్వంత బుద్ధి నుపయోగించి హేతుమార్గము ననుసరించి మీరు ఏదారిని ఎన్నుకొనినను మంచిదే. మీ స్వబుద్ధి నుపయోగింపుడు! ఈ మనిషి

అనుసరించు పద్ధతి తప్పు అని చెప్పుటకు మీ
కేమి హక్కున్నది! ఆ విధానము మీకు సరి
పడకపోవచ్చును గాక. అనగా, మీరే గనుక
ఆ మార్గమును అనుసరించినచో మీరు దిగ
జారి పతనము కావచ్చును. అంతమాత్రమున,
ఎదుటివాడు కూడ అట్లే కావలెనని ఎక్కడను
లేదు. అందుచే మీరే గనుక జ్ఞానమునుపది
యున్నచో, బలహీనుని అజ్ఞానిని ఎవనినయినా
చూచినపుడు అతనిని తప్పుపట్టవద్దు, మీకు
చేతనయినచో అతనిస్థాయికి దిగివచ్చి సహాయం
చెయ్యండి. అతను ఎదిగి తీరాలి. నేనతని తల
లోకి ఒక అయిదు గంటల కాలములో అయిదు
గంపల విజ్ఞానము కుక్కిపోయవచ్చును. కాని,
అందువలన చేకూరెడి మంచి యేమున్నది!
ఇంతకు ముందున్న పరిస్థితికన్న వానిస్థితి
మరింత అధ్వాన్నమగును.

పోయి అందరకును ఈ సందేశము నుపదే
శించుము, "లెండు మేల్కొనుడు. మరింక
యెంతమాత్రము నిదురింపవద్దు, అన్ని కోరిక
లను, అన్ని కష్టములను తొలగద్రోయుశక్తి
మీలో ప్రతి ఒక్కరియందును గలదు. దీనిని

విశ్వసింపుము. అట్లు విశ్వసింపుచో మీలోని ఆ శక్తి ప్రకటీభూతము కాగలదు.''......ఆ అనంతశక్తి, అనంత విజ్ఞానము, అప్రతిహతమయిన ఉత్సాహము మీలోనున్నదని మీరు భావన చేయగల్గినచో, ఆ శక్తిని వెలికి తీసి ప్రకటింపగల్గినచో మీరు కూడా నావలెనే కావచ్చును.

## 5. విద్య - సమాజము

మానవునిలో ఇదివరకే యున్న పరిపూర్ణత్వమును ప్రకటించుటయే విద్య.

విద్య యననేమి? పుస్తకములు చదివి సంపాదించు గ్రంథపాండిత్యము విద్య యగునా? కాదు. బహుముఖ విజ్ఞానము విద్య యగునా? అదియును కాదు. సంకల్పముయొక్క ప్రవాహము, వ్యక్తీకరణలు ఏ శిక్షణమువలన సమ్యగ్నియంత్రితములయి ఫలప్రదములగునో అట్టి శిక్షణయే విద్యయని పిలువబడును.

నా దృష్టిలో మనస్సు నేకాగ్ర మొనర్చుటయే విద్య. అంతేగాని వాస్తవములను ప్రోగు చేయుట విద్య యనిపించుకోనదు. నేనే గనుక నా విద్యాభ్యాసమును పునఃప్రారంభింపవలసి వచ్చినచో వాస్తవములను అభ్యసించుట యనునది యెన్నటికిని చేయను. దానికి

మారుగా, ఏకాగ్రతాశక్తిని సంగరాహిత్యమును సంపాదించుకొందును. అట్లు పరిపూర్ణముగ, సమగ్రముగా మలచుకొనిన బుద్ధియను పరికరముతో నా యిష్టము వచ్చిన విధముగ వాస్తవములను ప్రోగుచేసికొనగలను.

జీవనపోరాటము నెదుర్కొనుటకయి జనసామాన్యమును సంసిద్ధులను గావింపనిది; శీలసంపచ్ఛక్తిని, లోకోపకారగుణమును, సింహసదృశధైర్యసాహసములను వెలికి తీయనిదియు నయినచో—అట్టి విద్య విద్య అనిపించుకొనదగునా? మనిషిని తన కాళ్ళపయి తాను నిలబడగల్గునట్లు చేయునదియే నిజమయిన విద్య.

ఊరకే నీ బుఱ్ఱలోనికి యెక్కింపబడి, అచ్చట యెందుకూ పనికిరాకుండ మ్రగ్గిపోవుచు నీ జీవితకాలమంతయు జీర్ణము కాకుండ నిలచిపోయిన సమాచారము విద్య యని అనిపించుకొనదు. జీవనిర్మాణప్రదములై, మనిషిని మనిషిగా రూపుదిద్దజాలినవై, శీలనిర్మాణాత్మకములైన భావములను జీర్ణము గావించుకొనుటయే మనకు కావలెను. కేవలం ఒక్క అయిదు భావములను గనుక నీవు జీర్ణింపజేసికొని,

వానితో నీ జీవితమును నీ శీలమును నింప గల్గినచో ఒక గ్రంథాలయమందలి పుస్తకముల నన్నింటిని కంఠస్థము గావించినవాని కంటెను నీవు ఎక్కువ విద్యావంతుడవగుదువు.

విజ్ఞానమనునది మానవునిలో స్వతస్సిద్ధము గానే ఉండియే యున్నది. ఏ జ్ఞానమును బయట నుండి వచ్చి నీలోనికి ప్రవేశింపదు. అంతయును లోపనే యున్నది.........న్యూటన్ మహాశయుడు గురుత్వాకర్షణము నావిష్కరించి నాడని చెబుతూ ఉంటాము. అంతవరకును ఆ గురుత్వాకర్షణము ఏ మూలనో అతనికోసమయి వేచికూర్చొని యుండెనా యేమి! అది యాతని మనసునందే యుండియే యుండెను. తగిన సమయము లభించినది. దానితో నాతడా గురుత్వాకర్షణము కనుగొనుట జరిగెను. ఇంత వరకు ఈ ప్రపంచము గ్రహించిన విజ్ఞానమంతయును మనస్సునుండే వెలువడినది. ఈ విశ్వముయొక్క అంతులేని గ్రంథాలయము నీ స్వంత బుర్రలోనే యుండి. బాహ్యప్రపంచం కేవలం సూచనమాత్రమే; నీ స్వంత మన

స్సును అధ్యయన మొనర్చునట్లు గావించు సందర్భము మాత్రమే.

నాయకత్వము వహించి ఆజ్ఞాపించుటకే ప్రతివాడును ఇచ్ఛగించునే కాని, విధేయుడై ఆజ్ఞాపాలనము గావించుట కెవ్వడును యిష్ట పడడు. ఈ దుస్థితి కంతటికి మూలకారణము ప్రాచీనకాలపు బ్రహ్మచర్య వ్యవస్థ ఈ నాడు అడుగంటిపోవుటయే. విధేయుడవై ఆజ్ఞాపాలన మొనర్చుటను ముందు నేర్చుకో. ఆజ్ఞాధికారము తానంతటదియే లభింపగలదు. ఎల్లప్పుడును ఒక సేవకుని మాదిరిగా ప్రవర్తించుట నేర్చుకో అప్పుడే నీవు నాయకుడవగుట కర్హుడవు.

విద్య, విద్య, విద్య మాత్రమే. ఐరోపా లోని అనేక పట్టణములగుండా సంచరించుచు వానిలో పేదప్రజలకు సయితము సమకూరిన సౌకర్యములను, విద్యను పరికించిన నా మనస్సుకు మనదేశమందలి బీదప్రజల అవస్థ గుర్తుకు వచ్చినది. నా కనులు అశ్రుపూరితము లయినవి. ఈ తేడాకంతకు కారణమేమి? ఈ విభేదానికంతకు కారణము విద్యయే యని నాకు సమాధానము స్ఫురించినది.

మనకు కావలసినది ఈ శ్రద్ధయే. దురదృష్టవశమున మన భారతదేశమునుండి ఈ శ్రద్ధ యనునది దాదాపు పూర్తిగా అంతర్ధానమయిపోయినది. ఈనాటి మన దుస్థితికి ఇదియే కారణము. ఒక మనిషికి వేరొక మనిషికి— మనిషికీ మనిషికీ గల భేదాకు కారణము ఈ శ్రద్ధయే తప్ప అన్యమేదియును గాదు. ఒక వ్యక్తిని గొప్పవానిగా జేయునదియు, వేరొకనిని అల్పునిగా నొనరించునదియు ఈ శ్రద్ధయే సుమా.

ఏ విషయమునయినను తీవ్రముగా గైకొనకపోవుట, ప్రతి విషయమును వేళాకోళము గావించుట అను జబ్బు మనజాతి రక్తములోనికి చొచ్చుకుపోవుచున్నది. ఈ భయంకర వ్యాధిని నివారించుకొనండి. దరిజేరకుండ తరిమికొట్టండి. బలవంతులయు, శ్రద్ధాళువులై మెలగండి— మిగిలినదంతయూ దానికదే అనుసరించి వచ్చును.

మన దేశమునందలి బడుగుప్రజలకు మనము చేయవలసిన సేవ అంతయును—వారికి విద్య నొసంగుటయే, అనగా వారి స్వంత వ్యక్తిత్వ

మును పెంపొందించుటే......వారికి ఆలోచనలను అందజేయండి. వారికి కావలసినదదియే. మీరు ఆ విధముగా చేసినందుకు ఫలితముగా మిగిలినదంతా అనుసరించి రాగలదు.

రసాయనిక సంభారముల నొకచోట చేర్పుటయే మనపని. ఆ రసాయనిక పదార్థముల మధ్య చర్య జరిగి స్ఫటికీకరణము సంభవించుట ప్రకృతిశాస్త్రన్యాయము ననుసరించి అంతయు జరిగిపోవును......పర్వతము గనుక ప్రవక్తగారి చెంతకు రానిపక్షమున, ప్రవక్తయే పర్వతము చెంతకు పోవలసియున్నది. పేద పిల్లవాడు విద్య నార్జించుటకై రాలేని పరిస్థితిలో వానివద్దకే పోయి విద్యనందింపవలెను.

శీలమును నిర్మించునది, మానసిక బలమును పెంపొందించునది, బుద్ధిని వికసింపజేయునది, తన కాళ్ళపై తాను నిలబడునట్లుగా మానవుని తీర్చిదిద్దునది అగు విద్య మనకు కావలయును.

తర తరాలు బలవంతముగా నిరోధింపబడుచు వచ్చుచున్న సంకల్పశక్తి దేని ఫలితముగా దాదాపు నాశన మొనర్పబడినదో, నూతన భావములు వచ్చుట మాట యటుంచి

దేని ప్రభావముచే ఉన్న పాత ఆలోచనలే ఒకదాని వెంబడి మరొకటిగా అదృశ్యమై పోవుచున్నవో............నెమ్మది నెమ్మదిగా ఏదయితే మానవుని ఒక యంత్రముగా మార్చివేయుచున్నదో—'అట్టిది విద్య యగునా! నా యభిప్రాయంలో యంత్రము మాదిరి మారి మంచిగా నుండుటకన్న, స్వతంత్రముగా స్వంత తెలివితేటల నుపయోగించి తప్పుదారిబట్టినను మంచిదే.

ఆత్మవిశ్వాసము, శ్రద్ధ దృఢముగ నాటుకొని యుండవలెను. మార్గదర్శకసూత్రముగా బ్రహ్మచర్యము వెలుగొందుచుండవలెను. అట్లుండి, వేదాంతముతో మిళితమయిన పాశ్చాత్య విజ్ఞానశాస్త్రమే మనకు కావలసి యున్నది.........మానవుని లోపలనే విజ్ఞానమంతయు గలదని వేదాంతము చాటి చెప్పెను. పసిబాలునియందు సహితము ఇదే సత్యము. లోపల నున్న ఆ విజ్ఞానమును జాగృత మొనర్పుట మాత్రమే అవసరమయి యున్నది. అట్లు జాగృతము గావించుటే గురువుయొక్క పని.........కాని మూలము మాత్రము

మతమే. అన్నం వంటిది మతము; మిగిలినవి కూరలవంటివి. కేవలము కూరలను మాత్రమే తినుటవలన అజీర్ణము కల్గును. కేవలము అన్నమే తినినను ఫలితము అజీర్ణమే.

కేవలము అస్ఖలిత బ్రహ్మచర్యనిష్ఠ నవలంబించినంత మాత్రముననే విజ్ఞానము నంతటిని అతి స్వల్పకాలములో సముపార్జింపవచ్చునను ఈ సత్యమును గమనించితివా? బ్రహ్మచర్యము వలన ఒక్క పర్యాయము వినినగాని, తెలిసికొనినగాని ఆ విషయమును మరువకుండ జ్ఞాపక ముంచుకొనగల్గును. ప్రస్తుతము మన దేశమున ప్రతిదీ సర్వనాశనమగుచుండుటకు కారణము ఈ బ్రహ్మచర్యనిష్ఠ పాటింపబడక పోవుటయే.

నా అభిప్రాయము ప్రకారము గురు గృహ నివాసమే విద్య. గురువు జీవితములో శిష్యునకు వ్యక్తిగతమైన సన్నిహిత పరిచయ ముండవలెను. గురువుయొక్క వ్యక్తిగత జీవనము కనుల ముందు కాన్పింపనిదే విద్య యనునది లేదు. మీ విశ్వవిద్యాలయముల విషయమే గమనింపుడు. గత యేబది యేండ్లుగా కొన

సాగుచు వచ్చుచున్న యీ విశ్వవిద్యాలయములు ఏమి త్రవ్వి తలకెత్తినవి! [ఈ మాటలు క్రీ. శ. 1897 సం॥ న మద్రాసు నగరమున పలుకబడినవి] స్వంత ఆలోచనా ధోరణి గల ఒక్క వ్యక్తి నయినను అవి తయారుచేయ జాలకపోయినవి; కేవలము పరీక్షా కేంద్రములు గనే అవి మిగిలిపోయినవి. సమష్టి హితార్థమై త్యాగము గావింపవలెనను భావము మన దేశమం దింకను పెంపొందలేదు.

ప్రాచీన సమాజమునకు గాని, అధునిక సమాజమునకు గాని — సమాజమునకు సత్యమెన్నడును గౌరవమర్యాదల నొసంగదు. సమాజమే సత్యమునకు గౌరవ మర్యాదల నొసంగవలెను. అట్లు గానిచో ఆ సమాజము నాశనము కావలెను. సత్యముపై ఆధారపడి సమాజము తనను రూపు దిద్దుకోవాలి. అంతేగాని, సమాజమునకు అనువయినట్లుగా సత్యము సర్దుబాటు కాకూడదు............ అత్యున్నత సత్యములు ఏ సమాజమున నయితే అనుష్ఠాన రూపముగా ఆచరింపబడుచుండునో అట్టి సమాజమే సర్వోన్నత సమాజము. ఇది నా అభి

ప్రాయము. అత్యున్నత సత్యములను ఆచరించుటకు సమాజమున వీలుగానిచో, ఆ సమాజమును అందుకు సరిపడునట్లు చక్కదిద్దుము. ఇది యెంత శీఘ్రముగా జరిగిన నంత శ్రేయస్కరము.

నీవు చేతనయినంతవరకు జనసామాన్యము యొక్క బంధనములను ఛేదించుము—వారికి స్వేచ్ఛ నొసంగుమనుచు నేను ప్రబోధించెదను ......... సమాజశ్రేయస్సుకై, స్వసుఖాభిలాషనంతటిని నీవు త్యాగమొనర్పగల్గినచో నీవు బుద్ధుడవే కాగలవు—అన్ని బంధముల నుండి విముక్తుడవు కాగలవు.

ప్రతి వ్యక్తికి, ప్రతిజాతికి ఘనత నాపాదించుటకు మూడు విషయములు ముఖ్యముగా అవసరము. అవి:—

1) సౌజన్యమునకు గల శక్తుల యెడ దృఢ విశ్వాసము.

2) అసూయ, అనుమానములు లేకుండుట.

3) తాము మంచిగా నుండి ఇతరులకు మంచి గావింప ప్రయత్నించువారికి సాయపడుట.

మీ ఆదర్శమే గనుక భౌతికమయినదైనచో మీరును అట్లే కాగలరు. ఇటు చూడుడు! మీ ఆదర్శము ఆత్మ. ఆత్మ యొక్కటే నిలచియుండును. మిగిలినదేదియు బ్రతికి బట్టకట్టి నిలువజాలదు. ఆ పరమాత్మకు వలెనే మేమును శాశ్వతులమై యుందుము.

హైందవుడు తాను ప్రతి పనిని మతదృష్టితోనే యొనరించును. త్రాగుట, తినుట, నిద్రించుట, నడచుట, వివాహ మొనరించుకొనుట......చివరకు దొంగతనము గావించుట సహితము మతదృష్టితోనే గావించును... ప్రపంచంకొరకై ప్రతిజాతికిని ఒక కర్తవ్యముండును. ఎంతకాలముపాటయితే ఆ కర్తవ్యమునకు విఘాతము కలుగదో అంతకాలము పాటును ఎన్ని కష్ట నష్టములు వచ్చినను సరే ఆ జాతి చైతన్యవంతమయి జీవించి యుండును. కాని, ఆ కర్తవ్యమే గనుక నాశనమయినచో ఆ జాతి వినాశనమందును..

శీల భ్రష్టతయే జాతి నాశనమునకు ప్రథమ సూచనమని చరిత్రలో నీవు గమనించలేదా!

ఆ సూచన పొడసూపగనే ఆ జాతి వినాశనము కనుచూపు మేరలో నున్నట్లే.

జంతువులకంటె నేడు మనము ఏమంత ఎక్కువ నీతిమంతులమయి లేము. సాంఘిక శిక్షాస్మృతులకు భయపడి మాత్రమే మనము నీతిగా మెలగుచున్నాము. "నీవు దొంగతనము గావించినప్పటికి నీకే శిక్షా పడదు" అని గనుక సమాజ మీనాడు ప్రకటించినచో, ఇతరుల ఆస్తులను దోచుకొనుటకయి మనము పరుగులు తీయుదుము. మనలను నైతికప్రవర్తనులుగా నుంచునది పోలీసువాడు మాత్రమే. సాంఘిక కట్టుబాట్లే మనలను నీతిమంతులనుగా నొనరించుచున్నవి. ఈ విషయమున జంతువులకంటె మనం ఏమంత మెరుగుగా లేము.

సర్వసాధారణముగా నాయకులు శీలవంతులు కాని కారణముచేత పలురకముల మతశాఖలలో చాలవరకు క్షణకాలముపాటు మాత్రమే మన గల్గుచున్నవి. అవి బుద్బుదప్రాయములే. పరిపూర్ణప్రేమ, ప్రతిక్రియాభావ రహితమయిన ఉదార హృదయము— ఇవియే శీలమును నిర్మించును. నాయకునిలో

శీలమే గనుక లేకపోయినచో అనుయాయులు విధేయులయి భక్తి విశ్వాసములతో అనుసరింపరు. నాయకునిలో గల పరిపూర్ణ పవిత్రత వలననే నాయకునియందు విశ్వాసము, విధేయత అనుయాయులలో పెంపొందగలవు. ఒక భావమును గైకొనుము, దానికే పూర్తిగా అంకితమై పొమ్ము, ఓరిమితో పాటుపడుము —ఆశాకిరణములు నీకు పొడసూపగలవు.

"మీ మతం సమాజమున కేమి మేలొర్చినది" అనుచు తరచు మనలను ప్రశ్నించుచుందురు. సత్యం విషయంలో సమాజము ఒక కాలబద్ధమైనది. ఇది అసంగతము. వికాసోన్ముఖముగా మనము సాగించుచున్న ప్రయాణములో సమాజము ఒక మజిలీ మాత్రమే... ...ఒక శిశువు ఎల్లకాలము పసిపిల్లవానిగనే యుండుట కెట్లు సాధ్యముకాదో అదే విధముగా సమాజముకూడ ఒకే స్థితియందు శాశ్వతముగా నుండిపోజాలదు. పరిపూర్ణమానవ-శిశు వేనాటికిని నుండజాలదు. ఈ రెండు మాటలును—పరిపూర్ణమానవుడు, శిశువు అనునవి—పరస్పర విరుద్ధములు. ఆ కారణమున పరి

పూర్ణ సమాజ మనునది యేనాటికీ నుండదు. తప్పనిసరిగా ప్రాథమికస్థాయి నుండి మానవుడు ఎదిగి తీరాలి. ఆ ట్లత ఎదిగి తీరును......నా గురుదేవు లిట్లు చెప్పెడివారు: "నిన్ను నీవు వల వికసింపజేసికో! వికసించిన పద్మము చెంతకు తుమ్మెదలు వానంతట అవే వచ్చి చేరును."

ఇతరులలోని దోషములను గుర్తించకుము. దోషము అనగా అజ్ఞానము, బలహీనత. మీరు బలహీనులనుచు జనులకు చాటిచెప్పుట వలన ప్రయోజనమేమి? విమర్శన, విధ్వంసన ఎంతమాత్రము ప్రయోజనకరం కావు. మన మంతకంటె ఉదాత్తమయిన వానిని జనుల కొసంగవలెను. వారి జన్మహక్కు అయిన వారి మహోజ్జ్వల ప్రకృతిని వారికి తెలియజెప్ప వలెను.

నేను చెప్పునది "సంస్కరించు" అని కాదు. "పురోగమించు" అని నేను చెబుతాను. సంస్కరించవలసినంత అధ్వాన్న స్థితిలో ఏది యును లేదు. పరిస్థితుల కనుగుణముగా సర్దు కొనిపోవుటయే జీవిత రహస్యము. జీవనమును

వికాసమును మొనర్చునది ఇదియే. తనను అణగద్రొక్కుటకయి ప్రయత్నించుచున్న బాహ్యశక్తులకు వ్యతిరేకముగా ఎదిరించి నిల్చుటకు ఆత్మ గావించు ప్రయత్న ఫలితమే సద్దుబాటు. సద్దుకొని పోగలవాడే ఎక్కువ కాలము అత్యంత సుఖప్రదముగా జీవింపగలడు. ఈ విషయమును నేను ప్రబోధింపనప్పటికీ సమాజము మారుచున్నది; మారక తప్పదు.

ప్రేమ, నిజాయితీ, ఓరిమి——ఇవి తప్ప ఇతరమేమియు అవసరం లేదు. జీవ మనగా ఎదుగుదలయే - వికాసమే - వ్యాకోచమే — ప్రేమయే. అందుచే ప్రేమ అంతయు జీవమే. స్వార్థపరత్వమంతయు మృత్యువే — జీవిత ధర్మము ఇదే. ఇప్పుడుగాని, ఇక ముందుగాని, ఎప్పుడయినను ఇది సత్యమే. ఇతరులకు మంచిని చేయుటే, మేలొనరించుటే జీవము.

ఇతరులకు మంచి చేయకుండుటే మరణము. ప్రేమించువాడు మాత్రమే జీవించువాడు. ప్రేమ లేనివాడు చచ్చినవానితో సమానమే. కనుక నా బిడ్డలారా! ఈ లోకమున మీరు

చూచుచున్న మానవమృగములలో తొంభై శాతము చచ్చినవారే.

ఒకవంక నవీన భారతదేశ మిట్లు పలుకుచున్నది— "పాశ్చాత్య ఆదర్శములను, వేష భాషలను, ఆహారవిహారములను, అలవాట్లను అనుసరించినచో మాత్రమే మనము కూడ పాశ్చాత్యుల మాదిరిగా బలవంతులము, శక్తిమంతులము కాగలము." మరియొక వంక ప్రాచీన భారతవర్ష మిట్లు పలుకుచున్నది— "బుద్ధిహీనులారా! అనుకరణము ద్వారా పరాయివారి భావములు మీ స్వంతమెన్నటికిని కాజాలవు. స్వయముగా నార్జింపనిదే ఏదియును మీ స్వంతము కాజాలదు. సింహపు చర్మమును పైన కప్పుకొనినంత మాత్రముచేత గాడిద సింహము కాజాలునా!"

ఒకవంక నవ్యభారతమిట్లు చాటుచున్నది— "పాశ్చాత్యదేశము లొనర్చుచున్న దంతయును తప్పక మంచిదే. లేనిచో పాశ్చాత్యులు ఇంతటి గొప్పవారెట్లు కాగలరు!" మరియొక వంక ప్రాచీన భారతదేశ మిట్లు ప్రకటించుచున్నది— "ఈ మెరపు చమక్కు తీవ్రముగా

ప్రకాశించుచున్నది. నిజమే కాని, ఆ చమత్కృతిమాత్రమే. అది మీ కన్నులను మిరుమిట్లు గొల్పుచున్నది జాగ్రత్త సుమా!"

పైకి పకపక మని వినిపించు పెద్ద నవ్వు వంటిదే పశ్చిమ దేశములందలి సాంఘిక జీవితము. ఆ పైపొర క్రింద అంతయూ రోదనమే, దుఃఖమే. వెక్కి వెక్కి యేడ్పుటలో నది అంతమగుచున్నది. ఆ వేడుక, సంతోషము, ఆనందము, ఉత్సాహము అంతయును పైపైననే. కాని, వాస్తవమున కది విషాదవేదనాభరితము.

కాని, యిచ్చట భారతదేశమునందో - పైకి బాహ్యముగా వ్యాకులము, విషాదము గాన్పించును. కాని లోన మాత్రము ఆనందము, ఉత్సాహము, నిశ్చింత.

ఉపనిషత్కాలమున - అతి ప్రాచీనకాలము ననే మనము ప్రపంచమున కొక సవాలు చేసియున్నాము. "అమృతత్వము నందగల్గునది సంతతి నుత్పత్తిచేయుటవలనగాని, సంపద నార్జించుటవలనగాని సమకూడదు. త్యాగము ద్వారా మాత్రమే అమృతత్వము నంద గలము." ఈ సవాలును స్వీకరించి జాతి వెంబడి

జాతి యీ ప్రపంచ సమస్యలను సాధించుట
కయి పాటుపడినవి. అయితే కోరికల నీడేర్చుట
ద్వారా సుఖము చేకూరునను భావముతో
నవి పాటుపడినవి. గతమున అవి అన్నియును
పరాజయముల పాలైనవి. అధికార సంప
దల కొరకైన దాహము గొనివచ్చిన దుఃఖ
భారము క్రిందబడి పాతజాతులన్నియు నలిగి
నశించినవి. నూతనముగా నావిర్భవించిన
జాతులు కూడ, కుంటి నడకలు నడచుచు
కుప్పకూలి పడుటకు సిద్ధముగా నున్నవి. శాశ్వ
తముగా నిలచియుండునది శాంతియా—సంఘ
ర్షణమా అన్న ప్రశ్న యింకను తేలవలసి
యున్నది. అట్లే ఏది శాశ్వతము—

ఓరిమియా—అసహిష్ణుతయా?
సౌజన్యమా—దౌర్జన్యమా?
బుద్ధిబలమా—దేహబలమా?
ఆధ్యాత్మికతయా—భౌతికపరత్వమా?

అనునది తేలవలసి యున్నది. ఎన్నో యుగాల
క్రిందటనే ఈ సమస్యను మేము పరిష్కరించి
యున్నాము. ప్రాపంచికతకు దూరముగా
నుండుట—త్యాగమే—మా పరిష్కారము.

# 6. మానవసేవయే మాధవసేవ

నేను నా జీవితములో నేర్చుకొనిన అత్యుత్తమ పాఠ మేమనగా - సాధ్యమునందు చూపవలసినంత శ్రద్ధను సాధించు సాధనము నందును చూపవలయు ననియే...ఆ ఒకే సిద్ధాంతము నుండి నే ననేక పాఠముల నెల్లప్పుడు నేర్చుకొనుచున్నాను. కార్యసిద్ధికి కీలకమంతయు దానియందే - అనగా సాధ్యమునకు చూపవలసినంత శ్రద్ధ సాధనముల పట్ల కూడ చూపుటయందే కలదని నా నిశ్చయము.

ఇతరులయెడ మన కర్తవ్యము, వారికి ఉపకార మొనర్చుటే. అనగా ప్రపంచమునకు సాయపడుట. అసలు మనము ప్రపంచమున కేల సాయపడవలయును? ప్రపంచమునకు సాయపడు టనగా నిజముగా మనకు మనము సహాయపడుటయే...ఉన్నత ప్రదేశము నందు నిలబడి

చేతిలో ఐదు పైసలు పట్టుకొని "బిచ్చగాడా! ఇదుగో" అని దర్పముగా పలుకవద్దు, దానికి మారుగా బిచ్చగాడు అచట నిలచినందులకు అతనిపట్ల కృతజ్ఞతను చూపుము. అతనికి దానమిచ్చుటచేత నీవు నీకే ఉపకారము చేసికొన గల్గుచున్నావు. ధన్యుడగునది ఇచ్చువాడు కాని, పుచ్చుకొనువాడు కాదు. ఆ బిచ్చగాని మూలమున నీలో కనికర ముప్పొంగినది. ఆ విధముగా నీవు వినమ్రుడవు, పవిత్రుడవు, పరిపూర్ణుడవు అగుచున్నావు. ఇట్టి అవకాశము నీకు లభింపజేసినందులకు ఆ బిచ్చగానికి కృతజ్ఞుడవై యుండుము.

ఉద్రేక రహితుడు, ప్రశాంతచిత్తుడు, దయామయుడు, ప్రేమస్వభావుడు సత్కృత్యముల నాచరించి తనకు తానెంతగానో ఉపకారమొనర్చుకొనుచున్నాడు.

ఘనకార్యములను సాధించుటకు, సడలిపోని పట్టుదల ఎంతో కాలము అవసరము. కొందరు ఘన కార్యములను సాధించలేకపోయిరని మనము బాధపడ నవసరములేదు. కష్టములు కలిగినప్పుడు, ఘోర విపత్తులు ఎదురైనప్పుడు

తమలోనున్న స్వార్థ పిశాచములు గట్టిగా పోరాడుచున్నప్పుడు ఆధ్యాత్మికాగ్ని వారిని బయటకు తరుముచున్నప్పుడు అనేకులు పతన మగుట సహజమే!

చెడుపు చేయుటచేత, ఇతరులకే గాక, మనకు గూడ మనము హాని చేసికొను చున్నాము. మంచి చేయుటచేత మనకును, ఇతరులకును, మంచి చేకూరుచున్నది. కర్మ యోగము ప్రకారము జరిగిన పని, దాని ఫలితము నది యిచ్చితీరును. దానిని నశింప చేయ లేము. ప్రకృతిలో ఏ శక్తియు కర్మఫలితము నాపజాలదు. నేనొక చెడుపని చేసినచో, దాని వలన నేను బాధ అనుభవింపక తప్పదు. ఈ జగత్తులో ఏ శక్తియు దానిని నిలుపలేదు. అదే విధముగా నేనొక మంచిపని చేసినచో ఈ జగత్తులో దాని ఫలితముల నది యివ్వకుండ ఏ శక్తియు మాన్పలేదు.

సకల శ్రేయమునకు, సమస్త నీతివర్తనము నకు సంకేతపదము "నేను" గాదు, "నీవు". స్వర్గమున్నదో లేదో నరకమున్నదో లేదో ఎవరికి కావలయును? ఆత్మ యున్న నేమి!

లేకున్ననేమి! మూర్తు లేని దొకటి ఉన్నదో లేదో ఎవరికి లెక్క! ప్రపంచము మన కట్టెదుట నున్నది, అది దుఃఖమయము. బుద్ధదేవుని వలె దానిలోనికి ప్రవేశించి దుఃఖ నివారణకై నిన్ను నీవు అంకితమొనర్చుకొనుము. ఆ ప్రయత్నములోనే మరణింపుము. నీవు ఆస్తికుడవో, నాస్తికుడవో! వేదాంతివో! కర్మకుడవో! క్రైస్తవుడవో! మహామ్మదీయుడవో! ఎవరైననేమి! అది అంతయు మరచిపొమ్ము, నీవు మొట్టమొదట నేర్వవలసిన పాఠమిది — లోకములోని దుఃఖనివారణమునకై నిన్ను నీవు సమర్పించుకొనుము.

"భగవంతుని గూర్చిన వివిధ సిద్ధాంతములను తెలిసికొనవలయునను చింత నాకు లేదు" అని చెప్పిన ప్రవక్త బుద్ధుడొక్కడే! "ఆత్మను గూర్చిన అనేక నిగూఢ సిద్ధాంతములను చర్చించినందువలన కలుగు ప్రయోజనమేమి! మంచి చేయుము, మంచిగా నుండుము. ఇదే మీకు మోక్ష మొసగును. ఇదే సత్యమును మీచే దర్శింపచేయును" ధనమునుగాని, కీర్తిని గాని కోరక, నిష్కామముగా పని చేయువాడే

చక్కగా పనిచేయువాడు. ఆ విధముగా చేయగలడేని, అతడు బుద్ధుడగుచున్నాడు. ప్రపంచమును మార్చివేయగల శక్తి అతని నుండి ఉత్పన్నమగును.

మనలను గురించియే తలపోయుచుండుట స్వార్థమగును. అది గొప్ప పాపము, "నేను ముందు భుజింతును, ఇతరులకన్న మిన్నగా ధనము నార్జింతును, అన్నియును నాకే కావలయును" అని తలచువాడును; "ఇతరుల కన్న ముందు నాకు ముక్తి లభించును. వారికంటె ముందు నేను స్వర్గమునకు పోవుదును" అని తలంచువాడును స్వార్థపరులు. స్వార్థరహితు డీ విధముగా చెప్పును: "నేను చివర వరకు నుందును. స్వర్గము నా కక్కర లేదు. నా సోదరులకు సాయపడగలనేని, నేను నరకమునకైనను పోదును." మతము చేయు పరీక్ష ఇట్టి నిస్వార్థతయే. ఇట్టి నిస్వార్థత యెక్కువగా కలవాడే అధిక ఆధ్యాత్మిక జీవనుడు. అతడే భగవంతున కెక్కువ చేరువ కాగలడు.

నీ వెవ్వరికిని సాయము చేయజాలవు. సేవ మాత్రమే చేయగలవు. అవకాశమున్నచో

దేవుని బిడ్డలను సేవింపుము. దేవునే సేవింపుము. తన సంతానములో ఏ ఒకరినైన సేవించు అధికారమును, భగవంతుడు నీకు ప్రసాదించినచో నిజముగా నీవు ధన్యుడవే. నిన్ను గూర్చి నీవు గొప్పగా నెంచుకొనకుము. ఇతరులకు లేని సేవాభాగ్యము నీకు గల్గుటచేత నీవు ధన్యుడవైతివి. ఈ సేవనే ఆరాధనముగా చేసికొమ్ము.

భగవత్కార్యమును చేయు ప్రత్యేక అవకాశము మనకు లభించుట మన భాగ్యము. అంత మాత్రమున అది ఆయనకు సహాయము చేయుటకాదు. "సహాయము" అను మాటను నీ మనస్సునుండి వెలికివేయుము. నీవు సహాయము చేయజాలవు. అది దైవదూషణమైన మాట. నీవిక్కడున్నది గూడ భగవదిచ్ఛ వలననే కదా! భగవంతునకు సహాయము చేయుదు ననుకొనుచున్నావా! నీవు చేయగల్గినది, చేయవలసినది భగవంతుని అర్చించుట మాత్రమే. ఒక కుక్కకు నీవు ఒక కరడు అన్నము పెట్టునపుడు ఆ కుక్కను భగవంతునిగా భావించి సేవించుము. ఆ కుక్కలో భగవంతు

దున్నాడు. అన్నియు ఆ భగవానుడే. అతడే అన్నింట నున్నాడు.

ఎంతో తపస్సు చేసిన మీదట, పరమ సత్యము ఇది అని నేను అర్థము చేసికొంటిని — ప్రతిజీవియందు భగవంతుడున్నాడు. అంతకు మించి వేరు దైవము లేదు. ఎవరు జీవారాధకుడో అతడే నిజమయిన దైవారాధకుడు.

ఈ ప్రపంచ నరకములో, ఏ ఒక్కని హృదయములో ఏ కొంచెమైన శాంతి సౌఖ్యములు, ఒక్క రోజైనను కల్గించినచో అది 'సత్కర్మ' అనిపించుకొనును. జీవితమంతయు యాతనలు పడిన తర్వాత నే నీ రహస్యమును గుర్తించితిని. మిగిలిన దంతయు కేవలము బూటకము.

పట్ట పగటివలె నేను స్పష్టముగా చూచుచున్న భావమేమనగా 'దుఃస్థితి' యనునది అజ్ఞానముచే కలిగినదిగాని మరిదేనిచేతను గాదు. జగత్తునకు వెలుగు నిచ్చు వారెవరు? పూర్వకాలములో త్యాగము శాసనముగా నిలిచినది. ముందు యుగములకును అదే శాసనము. ఈ భూమిపై పుట్టిన అత్యంత సాహ

సోదరులు, ఉత్తములు అయినవారు పర హితార్థము, పరసుఖార్థము, తమ్ము తాము బలిచేసుకొన్నవారే. శాశ్వతమైన ప్రేమ, కరుణ గల బుద్ధ భగవానులు వందలకొలది కావలసి యున్నారు.

మన శక్తిని కోపాటోపములతో ధుమధుమ లాడుచు అనవసరముగా వ్యర్థము చేయుటకు బదులు ప్రశాంత మనస్సుతో పురుషకార మొనర్చుట మేలు. ఎవరికేది అర్హమో దానిని అతనికి చేరకుండ ఈ జగత్తులో ఏ శక్తియు ఆపలేదని నేను సంపూర్ణముగా విశ్వసింతును. గతించిన కాలము నిస్సందేహముగా గొప్పదే. కాని భవిష్యత్తు అంతకంటె శోభాయమాన ముగా నుండునని నేను త్రికరణ శుద్ధిగా నమ్ము చున్నాను.

మనుష్యులు ఇప్పటికే అవివేకమను మొసలి కోరలలో ఎట్లు చిక్కుకొనియున్నారో పరి కింపుడు!! అయ్యో, హృదయ విదారకమైన వారి ఆర్తనాదముల నాలకింపుడు. ఓ ధీరు లారా! లెండు! సంకెళ్ళచే కట్టబడిన ఆ దీను లను విడిపింపుడు. ఆ అనాథల దుఃఖమును

మాన్పును, అజ్ఞానాంధకార కూపములోపడి కొట్టుకొనుచున్న వారిని వెలుగులోనికి చేర్చును. కార్యరంగమున ముందడుగు వేయుడు "అభీః (నిర్భయులు కండు)" అనుచు భేరీనినాదముతో వేదాంతము ఎట్లు నినదించుచు ప్రకటించుచున్నదో పరికింపుడు.

ఇతరులలో గల దివ్యత్వమును ప్రకటించుటకు తగిన రీతిన సహాయము చేయుటే మన దివ్యత్వమును ప్రకటించుటకు గల ఏకైక మార్గము. ప్రకృతిలో అసమానత యుండినప్పటికిని, అందరకు సమాన అవకాశములు ఉండితీరవలయును. అట్లుగాక కొందరికి ఎక్కువగాను కొందరికి తక్కువగాను ఉన్నచో - దుర్బలులకు బలవంతులు కన్న ఎక్కువ అవకాశమిచ్చి తీరవలయును. మరొక విధముగా చెప్పినచో-సంఘములో చిరకాలముగా అట్టడుగున పడియున్న వారి కిప్పుడు అధికముగా విద్య నేర్పవలసియున్నది. ఎట్లన బ్రాహ్మణ బాలునకు ఒక అధ్యాపకుడే చాలినచో చండాల బాలునకు పదిమంది అవసరము. వారి కొరకై అధ్యాపకుల వదనముగా చేకూర్ప

వలయును. కారణ మేమన ప్రకృతి వారికి పుట్టుకతోనే బుద్ధివికలత నొసంగ లేదు. అట్టి పతిత మానవ కోటియే నేడు నీవు వాస్తవముగా ఆరాధింపవలసిన దైవస్వరూపులు.

పవిత్రముగా నుండుట, ఒరులకు మంచి చేయుట, యిదే పూజలన్నింటి సారాంశము. బీదలలోను, బలహీనులలోను, రోగులలోను దేవుని చూచుచు వారిని సేవించువాడు యథార్థముగా పరమశివుని పరమభక్తుడు. ప్రతిమల లోనే గాంచు వాని ఆరాధన ప్రారంభ స్థితి లోనిదే.

దైవ విశ్వాసరహితుడే కానిండు, ఆధ్యాత్మిక విద్యావిహీనుడే కానిండు: చర్చికిగాని, గుడికిగాని పోని కేవల ప్రాపంచిక జీవుడే కానిండు, మరెట్టివాడైనను అత్యున్నత స్థితిని అందగలడని బుద్ధుని జీవితము ప్రబోధించుచున్నది...యజ్ఞములను ఆపుటకు పశువునకు ప్రతిగా తన జీవితమునే బలియిచ్చుటకు సంసిద్ధుడైన సౌజన్యమూర్తి అతడొకడే. ఒకసారి అత డొక రాజు నిట్లు కోరెను. "నీవు స్వర్గమునకు పోవుటకు యజ్ఞము చేసి మేకపిల్లను బలి

నిచ్చుచున్నావు గదా! అంతకన్న మిన్నయగు మనుష్యునే బలియిచ్చినచో స్వర్గాధిక లోక మునే చేరుకొందువుగదా! కావున నన్నే బలి యిమ్ము." ఈ మాటల కారాజు ఆశ్చర్యచకితు డయ్యెను. అతనికి జ్ఞానోదయము కల్గినది.

పుణ్యపురుషులు ఇతరుల కొరకే జీవింతురు. జ్ఞానియగువాడు ఇతరులకొరకు తనకుతానే బలి యగును. మీకు ఉపకారము చేయుటచేతనే నాకు మేలు కల్గుచున్నది. అన్యథా గతిలేదు; లేనేలేదు.

పల్లెనుండి పల్లెకు పయనించుచు సకల మానవాళికి ఉపకరింపుము. విశాల విశ్వమునకు ఉపకారము చేయుము. ఇతరులకు ముక్తి సాధించుటకై నీవు నరకమునకై నను పొమ్ము... మరణము తప్పనప్పుడు మంచిపనికై మరణిం చుట మంచిది గదా!

ప్రపంచ చరిత్రను ఆమూలాగ్రము చూచి నచో గొప్పవారు గొప్ప త్యాగములను చేసి నట్లును, సామాన్య ప్రజ లా త్యాగ ఫలితము లను అనుభవించుచున్నట్లును కనుగొందువు. స్వకీయముక్తికే నీ సర్వమును త్యాగముచేయ

దలచెదవేని అది నిష్ప్రయోజనము. విశ్వ శ్రేయమునకై నీ స్వీయ ముక్తిని గూడ విడ నాడుదువో అప్పుడు నీవు భగవంతుడివే. దానిని గూర్చి ఆలోచింపుము.

ప్రపంచము పిరికి పందలకు గాదు. పారి పోవుటకై ప్రయత్నింపకుము. జయాపజయము లకు ఎదురు చూడకుము. నిస్వార్థ నిర్ణయ ముతో పొత్తు కూర్చుకొని పని చేయుము. జయించుటకై ఉద్భవించినవాడు దృఢ సంక ల్పము కలిగి పట్టువిడువక పనిచేయును. జీవిత రణరంగ మధ్యమున కాలము గడుపుము. నిద్రించునప్పుడుగాని, గుహలో నున్నప్పుడు గాని ఎవడైనను ప్రశాంతముగానే యుండ గలడు. కర్మమను సుడిగుండములోనికి దూకి నిలద్రొక్కుకొని కేంద్రస్థానమునకు చేరగలుగ వలయును. నీకు ఆ ఆధారము చిక్కినచో, నిన్నెవరు కదిలింపలేరు.

పవిత్ర భావోత్సాహ ప్రేరితులైనవారును, అచంచలభగవద్విశ్వాసముచే పరిరక్షితులును, సింహపరాక్రమ సదృశులునైన లక్షమంది స్త్రీ పురుషులు, దీనులందును, పతితులందును,

పీడితులందును గల అనురాగముతో ఈ భూమి నాలుగు చెరగులు సంచరించుచు ముక్తి సిద్ధాంతమును, సహాయ సిద్ధాంతమును సాంఘికోన్నత సిద్ధాంతమును, సమతా సిద్ధాంతమును ప్రబోధింతురుగాక!

నాయనా! నా మాటలయందు నీకేమాత్రమైన గౌరవము గలదేని, నేను నీకిచ్చు మొదటి సలహా యిది. నీ గది తలుపులను, కిటికీలను అన్నింటిని తెరచివేయుము, నీ నివాస ప్రాంతములో బీద ప్రజలనేకులు నీచస్థితిలోను, దురవస్థలోను కొట్టుకొనుచున్నారు. నీవు వారి చెంతకేగి ఉత్సాహముతోను, సామర్థ్యముతోను వారికి సేవ చేయుము. రోగపీడితులకు మందులు సరఫరాచేసి శ్రద్ధతో సేవింపుము. ఆకలిచే అలమటించువారి కింత అన్నము పెట్టుము. విద్యావిహీనునకు నీ శక్తివంచనలేక విద్య గరపుము. నీ సోదరులను ఈ విధముగా సేవింప మొదలు పెట్టితివేని, నా చిట్టితండ్రీ! నా మాట వినుము – నీకు శాంతి, దుఃఖోపశమనము తప్పక కల్గితీరును.

ఆరంభదశలో ఎట్లు సేవించవలెనో, ఎట్లు విధేయత చూపవలెనో, ఆత్మనిగ్రహము నెట్లు అభ్యాసముచేసికొనవలయునో తెలిసి అట్లు చేయవలయునని ఆజ్ఞాపించు సాహస మెవరి కున్నది! శౌర్యశక్తియనగా స్వార్థ త్యాగము గాని, స్వార్థప్రతిపాదన కాదుగదా! ఇతరుల ఉద్దేశ్యములను, నడవడిని నియమించుటకు ముందు, తాను ఆజ్ఞానిర్వహణలో ముందంజ వేసి ప్రాణమునైన అర్పించుటకు సంసిద్ధము గావలయును. మొట్టమొదట తన్ను తాను బలి చేసికొనవలయును.

భయమే మృత్యువు. నీవు భయమునకు అతీతుడవు గావలయును. కావున, ఈ రోజు నుండి నీవు నిర్భయుడవుగా నుండుము. నీ విముక్తికి పరహితమునకు నీ ప్రాణము లర్పించుటకు ఈ క్షణముంచే ఉద్యమింపుము. కండరములతో గూడిన నీ శరీరమును ఎముకల గూడును మోసికొనిపోవుటవలన ప్రయోజన మేమున్నది!

ధనికులను నమ్మవద్దు. వారు జీవచ్ఛవములు. వారియందు నాకు నమ్మకము లేదు.

శాంతస్వభావులు, వినయోపేతులు, విశ్వాస పాత్రులైన మీ యందే నాకు ఆశ యున్నది. భగవంతుని యందు విశ్వాసముంచుడు. వ్యవహార జ్ఞానము కాదు. అందులో ఏమియు లేదు. అనాథలకై విలపించుచు, సహాయమునకై అర్థింపుడు. అది వచ్చి తీరును. నేను ఈ దేశములో చలి చేతను, ఆకలి చేతను నశింపవచ్చును. కాని యువకులగు మీకు ఈ నా సానుతాపమును బీదలకొరకును, అజ్ఞానుల కొరకును, పతితుల కొరకును సంక్రమింప జేయు చున్నాను. నానాటికి అట్టడుగున పడి క్రింగి కుమిలిపోవుచున్న ఈ ముప్పదికోట్ల ప్రజల నుద్ధరించుటకై మీరు యావజ్జీవితమును, అంకిత మొనర్తుమని ప్రమాణము చేయుడు.

ఈ ప్రపంచ చరిత్ర అఖండ విశ్వాసోపేతులగు అగ్గురు వ్యక్తుల చరిత్ర. అది గంభీరము, పవిత్రమును అగు అగ్గురు శీలవంతుల చరిత్ర. మనకు మూడు విషయములు అత్యావశ్యకములు. అనుతాపము చెందుటకు హృదయము; ఆలోచించుటకు మెదడు, పని చేయుటకు చెయ్యి. నిర్మాణ శక్తి ఉత్పాదక యంత్ర

ముగా తయారు చేసికొనుము. ప్రపంచమునకై మొదట విచార పడుము...అసూయా ద్వేషములలో నీ మనస్సు వెనుదిరుగుచున్నదా! అని నిన్ను నీవు ప్రశ్నించుకొనుము. ప్రపంచమునకై కుమ్మరింపబడుచున్న మహా క్రోధ ద్వేషానలముచే సత్కార్యములు నశించుచున్నవి. నీవు పవిత్రుడవై శక్తిమంతుడ వైనచో నీవు, నీ వొక్కడవే యావత్ప్రపంచమునకు సరిసమానుడ వయ్యెదవు సుమా!

పరహితమునకై ఈ జీవితము రాలిపోవునట్టి దినము వచ్చునా! ఈ ప్రపంచము బొమ్మలాటగాదు. తమగుండె నెత్తురులో ఇతరులకై రాచబాటలను నిర్మించువారే మహాత్ములు. తన శరీరమును క్రిందపరచి దానిపై ఒకడు వంతెన నిర్మించును. ఆ వంతెనపై నడచి వేలాది ప్రజలు నదిని దాటుదురు. అనంత కాలమునుండి యిదేవిధముగా జరుగుచున్నది. అట్లే యగుగాక!! అట్లే యగుగాక!

ఓం తత్ సత్.

---

# 7. మతము, నైతిక శాస్త్రము

మృగమును మానవునిగా,
మానవుని మాధవునిగా
ఉన్నతస్థితికి
గొనిపోవు భావమే—మతము.
దైవమునకు
మానవునకు నిర్వచనం ఇది—

కేంద్రం ఒకచోట నిర్దేశింపబడి, పరిధి యెచ్చటనూ లేని ఒక అనంతమయిన వృత్తము మానవుడు.
పరిధి యెచ్చటనూ లేకుండి, సర్వత్ర కేంద్రమును కలిగియున్న ఒక అనంత వృత్తము భగవంతుడు.

నిస్స్వార్థత, స్వార్థపరత అనువానిని మినహాయిస్తే మరి దేనిలోనూ దైవానికి, దయ్యానికి భేదం లేదు. దైవానికి ఎంత తెలుసో దయ్యా

నికీ అంత తెలుసు; దైవానికి ఎంత శక్తి ఉందో అంత శక్తి దయ్యానికీ వుంది. దయ్యంలో పవిత్రత మాత్రమే లేదు. పవిత్రత అనేది లేకపోవడమే దానిని దయ్యంగా చేసింది.

ఇదే భావమును ఆధునిక ప్రపంచానికి అన్వయించి చూడండి. పవిత్రతా రహితంగా ఉండే విశేష విజ్ఞానంగాని, అధిక శక్తిగాని మానవులను దయ్యాలుగా చేస్తుంది.

మన పురోభివృద్ధికి దారితీసేదే సుగుణము; మన పతనానికి దారితీసేదే దుర్గుణము. మృగత్వము, మానవత్వము, దైవత్వము—అనే ఈ మూడు గుణాలూ మనిషిలో ఉన్నాయి. నీలో ఉన్న దివ్యత్వాన్ని పెంపొందించుటకు దారి తీసేది సుగుణము; నీలోని మృగత్వాన్ని వృద్ధి చేయుటకు దారి తీసేది దుర్గుణము. నీలోని పాశవిక ప్రవృత్తిని నిర్మూలించి నీవు మానవుడవు కావాలి. అంటే—ప్రేమశీలివి, దానశీలివి కావాలి. ఆ స్థితిని కూడా నీవు అధిగమించి పోవాలి. కేవలానందముగా, సచ్చిదానందమూర్తిగా కావాలి. దహించని అగ్ని లాగా అద్భుతమయిన ప్రేమ రూపమే నీవు

కావాలి. అయితే సామాన్య మానవప్రేమలో ఉండే బలహీనత లేని, విషాదభావమే లేని ప్రేమ రూపంగా నీవు కావాలి.

## స్వార్థరాహిత్యమే భగవంతుడు

బంగారు రాజభవనంలో సింహాసనం మీద అధివసించినప్పటికీ ఒకడు పూర్తిగా నిస్వార్థ పరుడయి యుండవచ్చును. అట్టివాడు భగవద్గత జీవనుడే అగుచున్నాడు.

మరియొకడు పూరిగుడిసెలో నివసించుచు, చింకిపాతలు కట్టుకొనిన అకించనుడే కావచ్చును. కాని వాడు స్వార్థపరుడయి యున్నచో అట్టివాడు గాఢసంసారమగ్నుడయి యున్నాడు.

నీవు ఆధ్యాత్మికపరుడవగుచున్నావు అన డానికి మొట్టమొదటి సూచన నీవు ఆనంద దాయకంగా ఉండటమే. ఒక మనిషి విషాదాత్మకంగా వ్యాకులపడుతూ కన్పిస్తే దానికి కారణం అజీర్ణరోగం కావచ్చునేమోగాని పారమార్థికత మాత్రం కారణం కాదు...
......................దుఃఖము కలుగుటకు కారణం పాపమేగాని మరొకటి కాదు. విషాద మేఘము లావరించిన ముఖములతో మీ కేమి

పని? అట్లుండటం దారుణం. విషాదమేఘములు నీ ముఖాన్ని ఆవరించుకొన్న రోజున నీ వా ముఖంతో బయటకు రాకుండా, నీ గదిలోనే తలుపులు మూసుకొని కూర్చో. నీలోని వ్యాకులత అనే వ్యాధిని బయటి ప్రపంచానికి కూడా అంటించడానికి నీకేమి హక్కు ఉన్నది?

ప్రవక్తలయొక్క మహిమాన్విత శక్తి యెచట గలదో ప్రపంచ చరిత్రనుండి మీరు తెలిసికొనలేదా? ఆ శక్తి యెక్కడుంది? బుద్ధివైభవంలోనా? వారిలో ఎవ్వరయిననూ వేదాంతమునుగూర్చిగాని, అత్యంత గహనమయిన తర్కశాస్త్రము గురించిగాని ఉద్గ్రంథమును వ్రాసియుండిరా? లేదు. వారిలో ఒక్కరు కూడా అట్టి రచన చేసియుండలేదు. వారు చాలా వింతగా మాట్లాడేవారు. క్రీస్తు మాదిరిగా ఆవేదన చెందితివా నీవు ఒక క్రీస్తు వయ్యెదవు; బుద్ధునివలె ఆవేదన చెందితివా నీవును ఒక బుద్ధుడి వవుతావు. అనుతాపమే జీవనము. బలము, వీర్యమును. పరితాపమే గనుక లేని నాడు బుద్ధివైభవ మెంత యున్నను భగవంతుని చేరుటకు సాధ్యం కాదు.

ఒక్క మాటలో చెప్పవలెనన్నచో—

మానవుని ప్రత్యేకస్వరూపమును తెలిసికొనుటయే వేదాంతముయొక్క ఆదర్శము. నీ సోదర మానవుని రూపంలో ప్రత్యక్షముగా వ్యక్తమగుచున్న దైవమునే నీవు ఆరాధింపలేకున్నచో, ఇక అవ్యక్త దైవమును నీ వెట్లు ఆరాధింపగలవు—ఇదియే వేదాంత సందేశము.

నిజముగా నీవు పవిత్రుడవే అయినచో నీవు అపవిత్రతను ఎట్లు చూడగలవు? ఏల ననగా, లోపలనున్న దేదియో అదియేగదా బయటను ఉన్నది. మనలోపలనే గనుక అపవిత్రత లేకున్నచో, బయటనున్న అపవిత్రతను మనం చూడలేము. వేదాంతము యొక్క అనుసరణీయ విధానములలో ఈ వాస్తవం ఒకటి. ఈ అంశమును మన జీవితాలలో అనుసరించడానికి మనం ప్రయత్నింపగలమని నేను ఆశిస్తాను.

నీలోగల దివ్యత్వమే భగవంతు డున్నాడనుటకు ఋజువు. నీవే ఒక ప్రవక్తవు కాని పక్షమున, భగవంతుని గూర్చిన సత్యమే యెన్నడును లేనిదగును. నీవే దైవ[illegible] పక్షమున దేవుడింతకు ముం[illegible]లేవాడని

అగును; ఇక ముందు కూడ లేకుండాపోవును. ఈ ఆదర్శమే ఆచరణీయమని వేదాంతము చాటి చెప్పుచున్నది. మనలోని ప్రతి ఒక్కడు ఒక ప్రవక్త కావాలి. నీ వెప్పుడో ఆ విధముగా ప్రవక్తవే అయి ఉన్నావు. ఆ విషయం నీవు తెలుసుకోవలసి ఉంది—అంతే. ఆత్మకు సాధ్యం కాని దంటూ ఏదయినా ఉందని ఎన్నడూ భావించవద్దు. అట్లు తలంచుట గొప్ప అపచారము. నీవు బలహీనుడవని లేదా ఇతరులు బలహీనులని—ఇట్లు దుర్బలతను ఉచ్చరించుటయే పాపము. పాప మనునది ఏదయినను ఉన్నచో బలహీనులమని పలుకుటే పాపము.

పరమాత్మ కానిది ఏదీ లేదని వేదాంతము ఘోషించుచున్నది.

సజీవమగు దైవము నీ యందే యున్నాడు. దానిని తెలిసికొనలేక మీరు దైవము కోసమై చర్చిలను, గుడులను కట్టించుచు వెర్రి మొర్రి అభూతకల్పన లన్నింటిని విశ్వసించుచున్నారు. మానవ శరీరములో గల మానవాత్మయే మన మర్చించవలసిన ఏకైక దైవము. సమస్త

జంతు దేహములను దేవాలయములే అను టయు నిజమే. అయినప్పటికీ, ఆలయాలలో రాజమహాల్ మాదిరిగా మానవ దేహము అత్యుత్తమ దేవాలయమై అలరారుచున్నది. మానవ శరీరరూపంలో ఉన్న దేవాలయంలో నేను పూజ చేయలేనిచో ఇంకే యితర దేవాలయాలూ ప్రయోజనకరములు కావు.

మతములోని అసలు మర్మం అంతా ఆచరణములో నున్నదిగాని, సిద్ధాంతములలో లేదు. మంచిగా నుండుట, మంచిని చేయుట—ఇదే మత సర్వస్వము.

" 'ప్రభూ! ప్రభూ!' అనుచు ఆక్రందించు వాడు కాదు స్వర్గమును చేరునది;

తండ్రి (భగవంతుని) సంకల్పము నాచరించు వాడే స్వర్గమును చేరును."

ఆధ్యాత్మికముగా గాని, మానసికంగా గాని, లేక శారీరకముగా గాని—

బలహీనతను కల్గించు దానిని దేనినైననూ సరే ఏ కాలిప్రేళ్ళతో కూడా స్పృశించకు. మానవునిలో గల సహజ స్వాభావిక బలము యొక్క ప్రకటనమే మతము. సర్పిలాకారపు

లీగచుట్టలో స్థితి శక్తి అణగియున్న మాదిరిగా, ఈ చిన్న శరీరంలో అనంతమయిన శక్తి నిక్షిప్తమయి ఉంది. ఈ లీగచుట్ట తనంతగా విస్తరించుచున్నది.

మానవుని యొక్క లేక మతముయొక్క, నాగరికత లేక పురోభివృద్ధియొక్క చరిత్ర ఇదియే.

మానవునకు శాంతి సౌఖ్యము కలుగ జేయుటే మతముయొక్క ప్రాథమిక లక్ష్యము. తరువాత రాగల జన్మమున సుఖము చేకూర గలదని దానికోసమై ప్రస్తుతం ఈ జన్మలో కష్టాలు అనుభవించడం ఏమంత తెలివయిన పనికాదు. ఇక్కడే, ఇప్పుడే మానవుడు సుఖపడాలి. అట్టి సుఖమును చేకూర్పజాలిన మతమే మానవజాతి పాలిట నిజమయిన మతము.

ఎప్పుడయిననుసరే, ఏ మతము విజయవంతమయినను, అది ఆర్థిక ప్రయోజనమును కలిగియుండినదై తీరాలి. అదే మోస్తరు మత శాఖలు వేనవేలుగా అధికారంకోసం పోరాటం సాగిస్తూంటాయి. కాని, నిజముగా మన్న

ఆర్థిక సమస్యను పరిష్కరింపగల మతాలు మాత్రమే విజయం సాధిస్తాయి. మనిషిని నడిపించేది అతని కడుపులోని ఆకలియే. మానవుడు సంచరించునపుడు ముందు దారి చూపించేది కడుపులోని 'ఆకలి' మాత్రమే. ఆకలి తీరిన పిమ్మట ఆలోచనలకు అవకాశం లభిస్తుంది. ఈ సంగతి నీవు గమనించలేదా? ఆలోచనే ముందు దారి తీయాలి అంటే, ఆ పరిస్థితి రావడానికి చాలా కాలం పడుతుంది.

ఎప్పుడయితే పసివాని కలల మాదిరి ఊహాలు నీలో లేకుండా పోతాయో, ఉన్నదున్నట్లు వాస్తవ స్థితిని నీవు గ్రహిస్తావో అప్పుడు నీ ఆలోచన ముందు నడుస్తుంది. ఇది ఆరంభం అయేసరికి నీవీ లోకాన్ని విడచి పోతావు.

రసాయన శాస్త్రము మొదలయిన విజ్ఞాన శాస్త్రములు ఏ విధంగా అయితే భౌతిక ప్రపంచ సత్యములను గురించి వివరించునో, అదేవిధముగా, మతం అనేది ఆధ్యాత్మిక ప్రపంచ సత్యములను గురించి తెలుపును. రసాయన శాస్త్రం నేర్చుకోవాలి అంటే ప్రకృతి

అనే గ్రంథాన్ని అధ్యయనం చెయ్యాలి. మతం గురించి తెలుసుకోవాలి అంటే; నీవు నీ మనస్సుని, నీ హృదయాన్ని తెరచి చదవాలి. ఆధ్యాత్మిక ఋషి అయినవాడు సామాన్యంగా భౌతిక విజ్ఞానశాస్త్ర విషయాలకు సంబంధించి సంతవరకూ ఏమీ తెలియనివాడుగానే ఉండటం జరుగుతుంది. అందుకవసరమయిన పుస్తకాన్ని బాహ్య ప్రకృతిని-అతడధ్యయనం చేయకపోవడమే దీనికి కారణం. అదేవిధంగా చాలా సందర్భాలలో విజ్ఞానశాస్త్రవేత్త అయినవాడు మతం గురించి అసలేమీ తెలియని అజ్ఞానిగా ఉండటం జరుగుతుంది. అతను కేవలం బాహ్య ప్రకృతినే అధ్యయనం చేయడం దీనికి కారణం.

"నేను ఆధ్యాత్మికపరుడను కావాలి అనుకొన్నాను. ఇందుకు సంబంధించిన. సత్యాలను ఆవిష్కరింపజేసుకోవాలి అనుకున్నాను. కాని నాకు అట్లు చేయుటకు వీలుపడలేదు. అందుచేత నేనీ విషయాలేవీ నమ్మను" అంటూ మాట్లాడేవాళ్ళు ఈ ప్రపంచంలో నీకు చాలా మంది కనిపిస్తారు. విద్యాధికులయిన వాళ్ళలో

కూడా ఇట్లాంటివాళ్ళు నీకు తటస్థిస్తారు. "నేను ఆధ్యాత్మికంగా ఉండాలి అని నా జీవితం అంతా ప్రయత్నించాను కాని అందులో ఏమీ లేదు" అని చాలామంది నీతో అంటారు. ఇదే సందర్భముగా మరియొక విచిత్ర సంఘటన కూడా ఉంది.

గొప్ప రసాయనిక శాస్త్రవేత్త ఒకడు నీ వద్దకు వచ్చి తన సంగతి నీకు చెప్పాడనుకో అతనితో నీవు "నేను రసాయనిక శాస్త్రవేత్తను కావాలి అని నా జీవితం అంతా ప్రయత్నించాను. అందులో నాకేమీ అగుపించలేదు. అందుచేత రసాయనశాస్త్రముగురించి ఏదీ నేను విశ్వసించను" అని చెప్పితి వనుకో, అప్పుడు ఆ శాస్త్రవేత్త "నీ వెప్పుడు ప్రయత్నం చేశావు?" అని నిన్ను ప్రశ్నించును. దానికి జవాబుగా నీవు అతనితో "నేను నిద్రపోయే ముందు ఓ రసాయన శాస్త్రమా రా! నా చెంతకు రా! అని పలుమార్లు అర్థించాను. అయినా ప్రయోజనంలేకపోయింది. ఆ శాస్త్రం నా వద్దకు రానేలేదు" అని సమాధానం చెబుతావు. నీ మాటలకు నవ్వి, ఆ శాస్త్రవేత్త

ఇట్లా అంటాడు ''రసాయనశాస్త్రం నేర్చుకునే పద్ధతి అదికాదు. నీవు ప్రయోగశాలకు పోయి ఆమ్లములను, క్షారములను తీసికొని మాటి మాటికి చేతులు కాల్చుకొనుచు ప్రయోగము లెందుకు జరుపలేవు! అట్లు చేయుటంవల్ల మాత్రమే నీకు రసాయనశాస్త్రం బోధపడి ఉండేది.''

మతం గురించి అర్థం చేసుకోవడానికి కూడా నీ వదేవిధంగా శ్రమపడుతున్నావా! ఏ విజ్ఞాన శాస్త్రం అభ్యసించాలన్నా అందుకొక ప్రత్యేక మైన పద్ధతి ఉంది. అట్లాగే మతం గురించి తెలుసుకోవాలి అంటే—దానిని తెలుసుకొనే విధానం ద్వారానే తెలుసుకోవలసి ఉంది.

భౌతికమయిన శక్తి ప్రకటనకు కేంద్ర స్థానముగానున్న ఐరోపా ఖండమే గనుక తన ప్రస్తుత స్థితిని మార్చుకొని, తన మనుగడకు, ఆధ్యాత్మికతను ఆధారముగా చేసికొనక పోయినచో—యాబది సంవత్సరాలలోపలనే అది మట్టిగొట్టుకొని పోగలదు. ఉపనిషన్మతము మాత్రమే ఐరోపాఖండమును నాశనము కాకుండా కాపాడజాలును.

[మొదటి ప్రపంచయుద్ధం జరగడానికి 17 సంవత్సరాలకు ముందే, క్రీ. శ. 1897లో వివేకానందస్వామి గావించిన హెచ్చరిక ఇది!]

వేదములుగాని, బైబిలుగాని, ఖురాన్‌గాని ఏదియును లేని తావునకు మానవజాతిని నడిపించాలి అని మనం వాంఛిస్తున్నాం. అయితే వేదాలను, బైబిలును, ఖురాన్‌ను ఈ మూడింటిని సమన్వయించి ఈ కార్యము సాధించాలి. మతాలు అనేవి అన్నీ ఏకత్వరూపమయిన మతమునకు వేర్వేరు ప్రకటనావిధానములే అని మానవజాతికి తెలియజెప్పవలసివుంది. ఈ వాస్తవం గనుక తెలిసివచ్చినచో ఎవనికే మార్గం ఎక్కువ అనుకూలమో దాని నతడు ఎన్నుకొనవచ్చును.

నీతిమంతుడవయి వుండు. ధైర్యశాలివై వుండు. నిండు గుండెతో పరిపూర్ణ నీతిమంతుడవయి, అన్నిటికి తెగించిన సాహసముతో ధైర్యవంతుడవయి వుండు. మత సిద్ధాంతాలతో నీ బుర్ర పాడుచేసుకోవద్దు. పిరికిపందలు మాత్రమే పాపం చేస్తారు. ధైర్యశాలురు పాపకార్యము

చేయనే చేయరు—ఊహాలలో నయిననుసరే వారు పాపమును తలంపరు.

నైతికత్వమునకు ఈయదగిన ఒకే ఒక నిర్వచనం ఇది:

ఏదయితే స్వార్థపూరితమో అది అవినీతి, ఏదయితే స్వార్థరహితమో అది నీతి.

ఒకడు సుందరమయిన భాషలో అందమయిన భావములను వెలువరింపవచ్చునుగాక; అయిననేమి, అవి ప్రజలను ప్రభావితం చెయ్యలేవు. మరియొకడు పలుకు భాషగాని, ప్రకటించు భావములుగాని అంత సుందరముగా నుండక పోవచ్చును. అయినప్పటికీ, అతని పలుకులు ప్రజలను ముగ్ధులనుకావించి వారి మనసులో హత్తుకొనిపోవును. అతని ప్రతి కదలికయు ప్రభావము చూపించు శక్తికలదియే యగును. ఇదంతా ఓజో శక్తియొక్క ప్రభావమే............పురుషుడుగాని, స్త్రీగాని, పవిత్రజీవనము గడుపువారు మాత్రమే ఓజో శక్తిని మేలుకొల్పి మెదడునందు భద్రపరచగలరు. ఆకారణముచేతనే బ్రహ్మచర్యము ఎల్లప్పుడును అత్యుత్తమమయిన సద్గుణమని

భావింపబడుచున్నది. కానుగనుక బ్రహ్మచర్య వ్రతదీక్షనుండి స్ఖాలిత్యము చెందినచో, తన పారమార్థికత నశించిపోవునని, తాను మానసిక సత్త్వమను, నైతిక దార్ఢ్యమును కోల్పోవుదునని మానవుడు భావించును. అందుచేతనే ఆధ్యాత్మిక మహాపురుషులను ప్రభవింపజేసిన మత సంప్రదాయాలన్నీ అస్ఖలిత బ్రహ్మచర్యము నంతగా నొక్కి చెప్పుచుండుటను నీవు గమనిస్తావు.

నైతికశాస్త్ర మెల్లప్పుడును "నేనుకాదు, నీవు" అని చాటి చెప్పుచుండును. "స్వార్థము కాదు, స్వార్థరాహిత్యమే" అనునది దాని ఆదర్శ సూత్రము. ఆ అనంతశక్తిని, ఆ అపరిమితానందమును నరుడు తన విషయేంద్రియముల మార్గమున పొందుటకు ప్రయత్నించునపుడు, అతడు నిరర్థకమయిన వ్యక్తిత్వమును అంటిపెట్టుకొనియుండును. దానిని విడనాడవలసియున్నదని నైతికశాస్త్రములు బోధించును. నీవు చిట్టచివర నిలచి ఇతరులు నీ ముందు నిలచు అవకాశమును కలుగ జేయవలెను. ఇంద్రియము లేమో "నేను" ముందని ఘోషించుచుండును.

నైతికశాస్త్రమో "నేను" చిట్టచివర నుంచవలెనని ఉద్బోధించును. భౌతిక ప్రపంచ స్థాయికి చెందిన "వ్యష్టి" నిర్మాణము మీద కాక, "వ్యష్టి" వినాశనము మీదనే—పరిత్యాగమను పునాది మీదనే నైతికశాస్త్రము నిలిచియున్నది. ఆ అనంతశక్తి లేక ఆ అపరిమితానందము భౌతిక ప్రపంచ స్థాయిలో ఎన్నడును అభివ్యక్తము కాదు. అట్లగుట అసాధ్యము. అనూహ్యము.

ప్రయోజన వాదముయొక్క ప్రమాణములు (Utilitarian Standards) మానవుల మధ్యగల నైతిక సంబంధములను వివరించలేవు. ఏలననగా, ప్రయోజనమును ఆధారముగా చేసికొని విచారించుటవలన ఏ నైతికసూత్రాలనూ మనం ఉత్పాదించలేము.

అనంతత్వమును చేరు సాధనమును, ఇంద్రియాతీతమయిన అనుభవమునకై చేయు యత్నమును విడనాడవలసినదిగ ప్రయోజనవాది (Utilitarian) మనలను కోరును. అతని దృష్టిలో ఇట్టి ప్రయత్నమంతా అసాధ్యము: అసంభవము, విపరీతము. ఒకవంక ఇట్లు

బోధించుచు, వేరొకవంక అతడు నీతి నియమానుసారముగ సంఘ శ్రేయమునకై పాటు పడమని మనలను ప్రేరేపించును. మంచి పనులను మనం ఎందుకు చెయ్యాలి? మంచిని చేయడం అనేది గౌణ విషయం (Secondary) మనకు ఒక ఆదర్శం అంటూ ఉండాలి. నైతికతయే పరమార్థముకాదు. పరమార్థమును జేర్చుటకది సాధనము మాత్రమే. గమ్యమే గనుక లేనిపక్షమున మనం నీతిమంతులముగా ఎందుకుండాలి? నేను ఇతరులకు మంచినే ఎందుకు చేయాలి? ఇతరులకు హాని నెందుకు కలుగచేయకూడదు? సౌఖ్యమే గనుక మానవజాతికి పరమగమ్యమైనచో, నేను నా సుఖం వరకు మాత్రం చూచుకొని, ఇతరులకు అసౌఖ్యం ఎందుకు కలిగించకూడదు? అట్లు చేయకుండ నన్ను ఆటంకపరచునదేమున్నది? మరియు, ప్రయోజనవాదముయొక్క ఆధారము మిక్కిలి సంకుచితమైనది.

ఈ ప్రయోజనవాద సిద్ధాంతాలు (Utilitarian Theories) ప్రస్తుతం ఉన్న సాంఘిక పరి

స్థితులలో మాత్రమే ఉపయోగ పడవచ్చును. అది దాటి, అంతకుమించి వాటికి విలువలేదు. కాని మతంనుండి, ఆధ్యాత్మికతనుండి గ్రహింప బడిన నైతికతగాని, నీతిశాస్త్రముగాని మానవుని అనంతస్వరూపమును తనలో ఇముడ్చు కొనునంత విస్తృతపరిధి (Scope) కల్గియుండును. అది "వ్యక్తి"ని గ్రహించును. ఏనప్పటికి అనంతత్వములో దానికి సంబంధ మున్నది. అది సంఘమును కూడ తన పరిధిలోనికి గ్రహించును. ఏలననగా, ఈ వ్యక్తులు కొందరు కూడుటవలన ఏర్పడినదే గదా సంఘమగు చున్నది.

---

# 8. భారతదేశము - మన కన్నతల్లి

భారత దేశము అంతరించునా! అదియే జరిగిననాడు ప్రపంచములోని ఆధ్యాత్మికత అంతయూ అంతర్ధానమగును; నైతిక పరిపూర్ణత్వమే అంతరించును. మతముపట్లగల అనురాగమాధుర్యమే నశించిపోవును. ఆదర్శ శక్యమంతయు అదృశ్యమగును. ఆ స్థానమున పురుష దేవతగా కామము, స్త్రీ దేవతగా భోగలాలసత అను జంట కలసి ఏలుబడి సాగించును. వానికి ధనము పౌరోహిత్యము నెరపును. వంచన, దౌర్జన్యము, స్పర్థపూజా కలాపములగును. మానవాత్మయే ఆహుతియగును. అంతటి పని ఎన్నటికి జరుగదు......భారత దేశము నశించునా! సమస్త ఉదాత్తతకు, ఆధ్యాత్మికతకు కన్నతల్లి ఈ దేశము. ఇది ఋషివరేణ్యులు నడయాడిన నేల. నేటికిని ఈ గడ్డమీద దివ్యపురుషులు మనుగడ సాగించు

చున్నారు. అట్టి ఈ దేశము నశించునా! ఎథీనియోా ఋషివద్ద నుండి దీపము తెచ్చుకొని నీ వెంటవచ్చెదను. ఈ విశాల ప్రపంచము లోని పల్లెలలో, పట్టణములలో, మైదానము లలో అడవులలో ఎక్కడయినను సరే, అన్వేషించుటకై నీ వెంట వచ్చుటకు నేను సిద్ధముగా ఉన్నాను. సోదరా! భారతదేశమునగల మహాత్ముల వంటి దివ్యపురుషులను మరెక్కడయినను నీవు చూపింపగల్గినచో నాకు చూపుము.

[ఎథీనియా అనునది గ్రీకుదేశమున గల ఒక నగరము. ప్రాచీనకాలమున దార్శనికులు, తత్త్వవేత్తలు, మేధావులు నివసించిన ప్రదేశము.]

ఈ లోకము మన మాతృదేశమున కెంతో ఋణపడియున్నది. ప్రతియొక్క దేశచరిత్రమును తీసికొని పరిశీలించినచో – లోకము ఈ క్షమామయుడును, సాధుమూర్తియు నయిన హిందువునకు ఋణపడియున్నంతగా మరి ఏ జాతికిని ఋణపడలేదని వెల్లడి అవుతుంది.........గ్రీకు దేశము అనునదియే ఈ

భూమిపై లేనికాలమున, ఊహించుటకైనను రోము నగరము ఊహింపబడని రోజులలో, నేటి యూరోపుజాతుల పూర్వీకులు అడవులలో తిరుగాడుచు ఒడలెల్ల పచ్చబొట్లు పొడిపించుకొనుచుండిన ప్రాచీన కాలముననే, ఈ భారతదేశము చైతన్యవంతమై ధర్మప్రచారములు వెలువరించుచు వెలుగొందినది. అంతకంటెను ఇంకను పూర్వకాలమునుండి—అనగా చరిత్రకందని కాలమునుండి దుర్జ్ఞేయ ప్రాచీనాంధకారములోనికి సంప్రదాయము సహితము తొంగిచూచుటకు సాహసింపజాలని కాలమునుండి—అంతటి పురాతన కాలమునుండి, నేటివరకును, ఈ దేశమునుండి దివ్యభావ పరంపరలు ప్రచారమై బయల్వెడలినవి. ఈ భావప్రచార సందర్భమున ప్రతి పలుకునకును ముందు శాంతి సందేశము, వెనుక శుభాశీస్సును సహచరులుగా ప్రవర్తిల్లినవి.

ఆర్యజాతికి చెందిన దేశము లన్నింటిలోను భారతదేశం ఈ నాడు అట్టడుగున బడియుండుటకు కారణమేమో చెప్పగలవారి బుద్ధి వైభవములోగాని, నిపుణతలోగాని ఈ దేశము తీసి

పోయినదా? ఈ దేశపు కళావైభవమును
కన్నులారగాంచి, గణితశాస్త్ర పాండిత్యమును
గమనించి, తత్వశాస్త్రమును పరికించి పిమ్మట
ఏ రంగములోనైననూ ఈ దేశము తక్కువ
యని చెప్పగలవా? లేదు. యుగయుగాలుగా
గురియైన విశ్రాంతినుంచి బయటపడి, దీర్ఘనిద్ర
నుండి మేల్కాంచి భారతదేశము సాటిదేశము
లలో సముచిత స్థానము నలంకరింప వలసి
యున్నది...... భారతదేశము జాతీయాదర్శ
ములు: త్యాగము, సేవ. ఈ మార్గములలో
దేశమును బలపరచుము. మిగిలినదంతయూ
దానికదే చక్కబడగలదు.

అమరుల సంతతి అయిన ఓ నా దేశీయు
లారా! ఈ మన భారత జాతీయ నౌక యుగ
యుగాలుగా మన నాగరకతను మోసికొని
పోవుచు తన యందలి అమేయ సాంస్కృతిక
సంపదచే ప్రపంచమునెల్ల సంపన్నముచేయుచు
వచ్చుచున్నది. పెక్కు శతాబ్దములనుండి ఈ
నౌక లక్షలాదిమందిని తనలో ఎక్కించుకొని
మోసికొనిపోవుచు జీవన సముద్రమున చరిం
చుచుపోయి సమస్త దుఃఖమునకు దూరముగా

ఆవలితీరముచేర్చి ఒడ్డెక్కించెను. మీ అపరాధములచేనేమి, ఇతర కారణములచే నేమి—కారణ మేదైననూ అది అప్రస్తుతము—ఆ నౌకకు రంధ్రముపడి, దెబ్బతినడం జరిగింది. ఆ నౌకలో ఉన్న మీరు ఇపుడేమి చేయుదురు! మీ రెక్కియున్న ఈ నౌకను శపించుచు, మీలో మీరు పోట్లాడుకొనుచు కూర్చొందురా? మీ రందరూ ఏకమై దాని రంధ్రములు పూడ్చి బాగుచేయరా? మన సర్వస్వము ధారవోసి మన జాతీయ నౌకను బాగుచేయుటకై అందరమూ కలసి హృదయపూర్వకముగా పనిచేసెదము గాక. ఈ ప్రయత్నమున ఒకవేళ మనము విఫలులమైతిమా—కానిండు—అప్పుడుకూడ పరస్పర శాపాలాపములతో గాక, శుభాశీస్సులతో మన మందరము ఒక్కటిగా కలసి మునిగి మరణించెదము గాక.

ఈ రాక్షసియొక్క ప్రాణము ఎచట దాచియుంచబడెనో మీ కిపుడు స్పష్టముగా అర్థమైయుండును. ఈ జాతి ఆయుష్పట్టు మతమునందు నిక్షిప్తము గావింపబడి యున్నది. వాని

నింతవరకు ఎవ్వరును నాశన మొనర్పలేక పోయిరి. ఎన్నో కష్టములకు, కడగండ్లకు తట్టుకొని ఈ హైందవ జాతి ఇంకను నిలచియే యుండుటకు కారణమిదే. ''జాతియొక్క జీవ రహస్యమును మతమునందే నిక్షేపమొనర్చి నందువలన లాభ మేమి? అన్యజాతులవలె సామాజిక, రాజకీయ స్వేచ్ఛలలో ఏల ఉంచ రాదు?'' అనుచు భారతీయ పండితుడొకడు ప్రశ్నించుచున్నాడు. అట్లు మాటలాడుట చాల తేలిక......వాస్తవ పరిస్థితి యిది. తన జన్మస్థానమునుండి బయలుదేరిన నది వేలకొలది మైళ్ళదూరము ప్రవహించి వచ్చినది. ఇప్పుడది తన జన్మస్థానమునకు మరలి వెనుకకు పోగలదా? అది సాధ్యమా? అట్లు మరలిపోవుటకు గనుక నది ప్రయత్నించినచో అది బహుముఖములుగా చెదరిపోయి ఎండిపోవును. త్వరితముగనో లేక ఆలస్యముగనో ఎప్పుడో ఒకప్పుడు నదీప్రవాహము చివరకు సముద్రమును చేరక తప్పదు. బహిరంగ మనోజ్ఞ సుందర మైదానములగుండానో, మురికి నేలల మీదుగ కొట్టుమిట్టాడు కొనుచునో ఎట్లు ప్రవహించి

నప్పటికి నదికి చివరకు సాగరమే గతి. ఈ పది వేల యేండ్లకు పైగా కొనసాగుచు వచ్చుచున్న మన జాతీయ జీవన విధానము తప్పుదారి అయినప్పటికీ మనకు వేరు గత్యంతరము లేదు. మన జాతికి, మతమునకు మారుగా వినూత్న శీలమును మరియొక దానిని రూపొందించుటకు తలపెట్టినచో అట్టి ప్రయత్నమునకు అనివార్యఫలము మనజాతి వినాశనమే.....

నివురుగప్పిన నిప్పు మాదిరిగా, పైకి నిర్జీవముగా కన్పించుచున్నప్పటికీ మన జాతీయజీవన వహ్ని ఇంకను రగులుచునే యున్నది.

మతమే—ఈ జాతి జీవనము
మతమే—ఈ జాతి భాష
మతమే—ఈ జాతి భావము.

మా రాజకీయము, సమాజము, పౌరపాలన, ప్లేగు నివారణా కార్యక్రమము, క్షామ నివారణ - ఇవి అన్నియూ, ఇంతకాలముగా ఎట్లు నిర్వహింపబడుచు వచ్చినవో అదేవిధముగా - మతముద్వారా మాత్రమే నిర్వహింపబడవలెను. అట్లుగాక, మతమును కాదని ప్రయత్నించినచో, మిత్రమా! ఉద్రేక పూరిత

మయిన మీా పద్ధతులు, పెదబొబ్బలు అన్నియూ ఎందుకూ పనికి రాకుండా పోవును.

కార్యసాధనకు అనుసరింపబడు మార్గము ప్రతిదేశమునందు ఒకటే. శ్రేష్ఠులై లెక్కింప దగినంత ఏ కొలదిమంది శక్తిమంతులో శాసించి నట్లు అమలుజరుగుట అనునదే ఆ విధానము. మిగిలిన జనసామాన్యము గొర్రెలమంద మాదిరిగా ఆ నాయకులను అనుసరించి పోవుదురు. మీా (అమెరికనుల నుద్దేశించి) పార్లమెంటు, సెనేటు, వోటు, సంఖ్యాధిక్యత బ్యాలట్ - వీనితో కూడిన మీా రాజకీయవిధానమును నేను గమనించితిని. మిత్రమా! ఎక్కడ చూచినా అదే పద్ధతి.........ఇప్పుడు ప్రశ్న యిది. హిందూదేశమున ఈ ప్రకారము అధికారము వహించి నడిపించునది యెవరు! ఆధ్యాత్మిక మహాపురుషులే మా దేశమున మార్గనిర్దేశకులు. మా సమాజమునకు దారి చూపి నడిపించునది ఆ మహానుభావులే. సామాజిక న్యాయములను ఆచారములను అవసరం అయినప్పుడు సంస్కరించునది ఆ మహనీయులే.

వారు చెప్పినదెల్ల మేము మారు పలకకుండా విని, వారి ఆదేశము శిరసావహిస్తాము.

మున్ముందుగా ఈ విషయం అర్థం చేసుకో డానికి ప్రయత్నించండి.

మనిషి శాసనములను రూపొందించునా? లేక శాసనములే మనిషిని రూపొందించునా?

మనిషి ధనమును ఆర్జించునా? లేక ధనము మనిషిని తయారుచేయునా?

మనిషి పేరు ప్రఖ్యాతులు గడించునా? లేక పేరు ప్రఖ్యాతులు మనిషిని రూపొందించునా?

కనుక, మిత్రమా! మున్ముందుగా నీవు నిజ మయిన "మనిషివి"గా అగుము. శాసనములు, ధనము, పేరుప్రతిష్ఠలు, ఇంకను మిగిలిన వన్నియు తమంతట తామే నీ వెంటబడి వచ్చును. హేయమయిన అసూయను వదలి పెట్టు. కాట్లకుక్కలవలె పరస్పరము కలహించు స్వభావము విడనాడుము. సదుద్దేశములను, సన్మార్గమును, ధర్మబద్ధమయిన ధైర్యమును దాల్చుము. ధీరుడవై నిలు. మానవునిగా నీవు జనన మెత్తిన గుర్తుగా చెరగని ముద్రలను నీ వెనుక వదలిపొమ్ము......

సత్యమును, ప్రేమను, నిజాయితిని నిరోధించుట యెవరికిని సాధ్యముకాదు. మీలో నిజాయితీ యున్నదా? ప్రాణముమీదికి వచ్చినను వెనుదీయని నిస్వార్థపరులై యున్నారా? మీరు ప్రేమింపగలరా? అయినచో భయపడవలదు. మరణముకైనను మీరు వెరగంద పనిలేదు. నా బిడ్డలారా పదండి ముందుకు. ప్రపంచమంతటికి వెలుగు అవసరమై యున్నది. లోకము వెలుగుకోసమై ఎదురుచూచుచున్నది. ఆ ప్రకాశము ఒక్క భారతదేశమువద్ద మాత్రమే గలదు. గారడీ వేష విన్యాసములలోను, దాంభిక డంభములలోను ఆ ప్రకాశము కానరాదు. మరి—నిజమైన మతముయొక్క భావవైభవమును బోధించుటలో – మహోన్నత ఆధ్యాత్మిక సత్యమును విశదీకరించుటలో ఆ ప్రకాశము ఇమిడి యున్నది. ఆ తేజమును కలిగియున్న కారణముననే అనేక దురవస్థల పాలైన ఈ జాతిని భగవానుడు నేటివరకు పదిలపరచియున్నాడు. నేడు తగిన సమయమాసన్నమైనది. మహోదాత్త కార్యములను నిర్వర్తించుటకై మీరు జన్మించితిరని ఓ నా

బిడ్డలారా విశ్వసించండి. కుక్క-పిల్లల మొరుగుళ్ళకు మీరు భయపడకుందురుగాక! అంతే కాదు-పిడుగుపాటునైనను మీరు వెరపు చెందకుండెదరుగాక. లెండు కార్యతత్పరులు కండు.

భారతదేశము సముద్ధరింపబడుట తధ్యము. అయితే ఈ సముద్ధరణము కండబలముతో కాక, ఆత్మశక్తితో సాధింపబడును. చేతిలో విధ్వంసక పతాకమును ధరించి కాక, శాంతియుత ప్రేమ పతాకమును చేబూని ఈ సముద్ధరణము జరుగును.

సజీవముగా నేను ఒక దివ్య దృశ్యమును దర్శించుచున్నాను. అత్యంత ప్రాచీనమయిన మన దేశమాత మరల మేల్కాంచినది. ఆ దివ్యజనని పునరుజ్జీవనము చెంది, నవ్యచైతన్యము పుంజుకొని, మరింతగా ఇనుమడించిన ప్రతిష్ఠతో తన సింహాసనమున ఆసీనయై యున్నది. శాంతిపూర్వకముగా శుభాశీస్సులతో ఈ దివ్యమాతను గురించి జగత్తంతటికి చాటి చెప్పుడు.

కర్షకుల గుడిసెల నుండి, నాగలి చేతబూని నవ్యభారతము లేచి వచ్చునుగాక.

చేపలు పట్టెడి, చెప్పులు కుట్టెడి, వీధులు చిమ్మెడి సామాన్యజనుల గుడిసెలనుండి నవీన భారతము లేచివచ్చును గాక.

చిల్లరవస్తు దుకాణమునుండి, సంతలనుండి, బజార్లనుండి, కర్మాగారమునుండి నవ్యభారతము బయల్వెడలునుగాక.

తోటలనుండి, అడవులనుండి, కొండలనుండి, గుట్టలనుండి నవీన భారతము లేచివచ్చునుగాక.

మన భారతీయులము ఒక శాశ్వత వ్యవస్థను నిర్మించుకొని సంస్థారూపముగా పనిచేయలేము. ఇది మనలోని పెద్ద లోపము. అధికారమును మనము ఇతరులతో పంచుకొనుటకిచ్చగింపకుండుట, మన తరువాత ఎట్లు జరుగునో అని దూరము ఆలోచింపకపోవుట ఇందుకు కారణము.

జనరల్ స్ట్రింగు అను పేరుగల నా ఆంగ్లేయ మిత్రుడు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయమున భారతదేశమున పనిచేసి యుండెను. ఆ యుద్ధమును గురించి ఆయన అనేక కథలు గాథలు చెప్పుచుండెడివాడు.

ప్రసంగ సందర్భమున ఒకనాడు సేనాయన నిట్లు ప్రశ్నించితిని. "చాలినన్ని తుపాకులు, వలసినంత మందుగుండు సామగ్రి, ఆహార పదార్థాలు సమృద్ధిగా కలిగియుండి, సుశిక్షితులు అనుభవజ్ఞులు అయిన సిపాయీలు పరాజయమొందడం ఎట్లు సంభవించినది!" దానికాయన ఇచ్చిన జవాబిది. "ఆ సిపాయీలకు నాయకత్వం వహించినవాళ్ళు సేనకు ముందు నడచుటకు మారుగా, తాము వెనుక నెచ్చటో సురక్షిత ప్రాంతమున నిలచి "వీరకుమారులారా! ధైర్యముగా పోరుసల్పండి" అంటూ అరచెడివారు. సేనాని అన్నవాడు సైన్యమునకు ముందునిలచి ప్రాణములకు తెగించి పోరాడినగాని మిగిలిన సైనికులు హృదయపూర్వకముగా ధైర్యముతో పోరాడజాలరు. నాయకుడు ముమ్ముందుగా తన ప్రాణములను ఆహుతిగావించవలెను. ఒక ప్రయోజనమునకయి నీ ప్రాణము లొడ్డుటకు సిద్ధమయిన నాడే నీవు నాయకుడవు కాగలవు. అవసరమయిన త్యాగమునకు సిద్ధపడకుండానే మనం అందరం నాయకులము కావాలని ఆశిస్తాం. చివరకు ఫలితం

ఏమీ ఉండదు. మన మాట నెవ్వడూ లక్ష్య పెట్టడు.

మున్ముందుగా విధేయతను అలవరచుకో. ఈ పాశ్చాత్య దేశాలలో ప్రబలమైన స్వాతంత్ర్యతా భావముతో పాటుగా, అంతబలీయము గానూ, విధేయతా భావము కానవచ్చును. మనం చూస్తే ఎవరికి వాళ్ళమే అధికులమని అహంకరిస్తాము. ఈ అహంభావము వలన ఏ కార్యమూ సానుకూలముగ నిర్వహింప బడదు. వ్యక్తిపురోభివృద్ధికి కాని, దేశ పునరుజ్జీవనమునకు కాని జాతీయ ముఖ్యలక్షణములు — ఉత్సాహపూరితమయిన క్రియాశీలత, అంతులేని ధైర్యము, అద్భుతమయిన శక్త్యుత్సాహములు వీటన్నిటిని మించి పరిపూర్ణ విధేయత. ఈ అఖిలలక్షణములు మనలో పూర్తిగా లోపించినవి.

అసూయ అనునది బానిస జాతికి సహజ లక్షణము. ఈ అసూయయే మన జాతీయ శీలమునకు దాపురించిన వినాశకారి. సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడును సహితము, మన

లోని ఈ అసూయ కారణమువనే, మన కేమియు చేయజాలకున్నారు.

కర్తవ్యమును పూర్తిగా నెరవేర్చి, ఈ లోకమును వదలిపెట్టినవానిగా నన్ను భావించండి. కార్యభారమంతా పూర్తిగా మీ భుజస్కంధముల మీదే ఉందని తలంచండి. మీరే, మన మాతృదేశ యువ జనమే ఈ కార్య నిర్వాహణకు నిర్దేశింపబడినారని భావించండి. కార్యతత్పరులు కండు.

వ్యక్తిగాని, దేశముగాని ఇతరులతో కలియకుండా దూరముగా ఏకాకిగా మనుగడ సాగించుట వీలుపడదని నా దృఢవిశ్వాసము...

ఇచ్చి పుచ్చుకొనుట మనుగడకు మూలమయిన సూత్రము. భారతదేశము మరల తాను పునరుద్ధరణ మొందదలంచినచో తన సంపదలను వెలికి తెచ్చి ప్రపంచములోని అన్ని దేశములకు వెదజల్లవలెను. బదులుగా, ఇతర దేశములు తనకివ్వగల్గిన సంపదలను స్వీకరించుటకు సిద్ధమై యుండవలెను.

వికాసమే జీవనము – సంకోచమే మరణము
ప్రేమయే జీవనము–ద్వేషమే–మరణము

ఏనాడయితే మనము అన్యజాతులను ద్వేషించుట ప్రారంభించామో ఆనాటినుండి మన వినాశము మొదలయినది. జీవన లక్షణం అయిన వికాసమునకు మనం గనుక మరల కున్నచో మన వినాశనము అనివార్యము.

దేశములోని జనసామాన్యమును నిరాదరణ చేయుటయే మన జాతి చేసిన ఘోర పాపముగా నేను భావించుచున్నాను. మన దేశ పతనమునకు కారణములలో ఈ ఉపేక్ష ఒకటి. ఈ దేశములోని జనసామాన్యానికి మంచి విద్య నేర్పి, కడుపునిండా తిండిపెట్టి, చక్కని సంరక్షణ లభింపచేయువరకు రాజకీయములవలన ప్రయోజనమేమియు నుండదు. మన విద్యకోసమై ధనమొసంగునది ఈ పేద ప్రజలే. మన దేవాలయాలు కట్టునది వీరే. ప్రతిఫలముగా వారికి దక్కినదేమి!...శాసన పీడనములే. ఆచరణమున వారు కేవలము మన బానిసలు. మాతృదేశమును పునరుజ్జీవింప

చేయవలెనన్నచో ఈ జనసామాన్యమునకై మనము తప్పక పాటుపడి తీరాలి.

అందువలన తమ ప్రాచీన వైభవమును గురించి హిందువులు ఎంత ఎక్కువగా తెలిసికొనిన, అంత ఉజ్జ్వలముగా వారి భవిష్యత్తు ఉండగలదు. ఇంటింటికి పోయి భారతదేశ గత వైభవమును ప్రతివానికి తెలియజెప్పినవారు, జాతికి మహోపకారము చేసినవారగుచున్నారు. మన దేశము పతనమొందుటకు కారణము మన పూర్వీకు లేర్పాటుచేసిన శాసనాలు, ఆచార సంప్రదాయములు చెడ్డవగుట మాత్రం కాదు. అది కారణం కానేకాదు. మరి - వారు నిర్మించిన శాసనములు సంప్రదాయములు నిర్దేశింప బడిన సహజ పరిణామక్రమాన్ని అనుసరించి పరిసమాప్త స్థితిని చేరువరకు కొనసాగక మధ్యలో అడ్డగింపబడుటే ఈ పతనానికి కారణము.

ఈ దేశమున చేయవలసిన పనులెన్నియో గలవు, కాని సాధన సంపత్తి మాత్రము లోపించియున్నది. గొప్ప గొప్ప ఆలోచనలు గావించుటకు మనకు ధీశక్తి గలదు. కాని,

కార్యరూపమున అమలు జరుపుటకు చేతులు లేవు. మహోదాత్తమయిన వేదాంత తత్త్వ మున్నదిగాని దానిని అనుష్ఠానమునకు గొని వచ్చు శక్తి మనకు లేదు. మన గ్రంథములలో సర్వజన సమానత్వము ప్రవచింపబడియున్నది కాని, ఆచరణములో మనము పాటించు విధే దాలకంతే లేదు. మహోన్నతము పరమో దాత్తము అయిన నిస్వార్థ సంగరహిత కర్తవ్య నిష్ఠ ప్రబోధింపబడినది మన హిందూదేశము ననే. కాని, వ్యవహార జీవనమున మనము అత్యంత క్రూరులము, హృదయశూన్యులము అయి ప్రవర్తించుచున్నాము. మాంసవసాది వికారస్వరూపమయిన మన దేహమును వించి విశాలముగా ఆలోచింప లేకున్నాము......

లక్ష్మీకటాక్షమునకు దూరమైపోయి, దుర దృష్టపీడితులయి, వివేచనాజ్ఞానము పూర్తిగా నశించిపోయి, అధఃపతితులయి, ఆకలిచే మల మల మాడుచు, పరస్పరము కలహించు కొనుచు, అసూయాపరులయి అలమటించు చున్న ఈ దేశప్రజలను ఎవ్వరయినా హృదయ పూర్వకముగా ప్రేమింపగల్గిన నాడు—మన

భారతదేశము మరల జాగృతము కాగలదని నేనూ విశ్వసించుచున్నాను. జీవితభోగములను అనుభవింపవలెనను కోరికలవన్నింటిని విస నాడి, విశాల హృదయులయిన స్త్రీ పురుషులు వందలకొలదిగా ముందుకు వచ్చి, పేదరికము, అజ్ఞానము, అను సుడిలోబడి నానాటికి క్రుంగి క్రుశించి అణగారిపోవుచున్న లక్షలాది స్వదేశీయుల నిమిత్తము, వారి సంక్షేమము నిమిత్తము అపరిమితమయిన ఆకాంక్షతో తమ సర్వశక్తిని ధారవోసి కష్టించి పనిచేసినచో మాత్రమే మనజాతి జాగృతము కాగలదు.

బీదసాదల దుస్థితియే భారతదేశములోని అన్ని అనర్థములకు మూల కారణము. పాశ్చాత్యదేశాలలో ఉండే పేదలు పిశాచములే. వాళ్ళతో పోలిస్తే మన దేశంలో ఉండే పేదలు నిజముగా దేవతలతో సమానులే అందువలన మన పేదలనుద్ధరించుట చాలా సులభసాధ్యము. మన దళిత ప్రజకు మనం చేయవలసిన సేవ అంతా - వారికి విద్య నేర్పుటయే, వారు కోల్పోయిన వ్యక్తిత్వమును వారిలో పెంపు చేయుటయే.

సంస్కరణ సమాజములతో, సంఘ సంస్కర్తలతో, గత మున్నూటిక శతాబ్దకాలముగా భారతదేశమున తీవ్రసంచలనము చెలరేగుచున్నది. అయిననేమి? పాపము ఆ ప్రయత్నములో వారిలో ప్రతి ఒక్కరును విఫలులైనారు. అసలు రహస్యము వారికి బోధపడలేదు. గ్రహించవలసిన మహాద్విషయమును వారు గ్రహించనేలేదు. తొందరపాటులో వారు సమాజములోని దోషములన్నిటికీ మతమే కారణమని ప్రకటించినారు. వెనుకటికి ఒక కథలో మిత్రుని నుదుట వ్రాలిన దోమను చంపుటకు ప్రయత్నించిన వాడొకడు దోమతో పాటు మిత్రునికూడ చంపునంతటి దెబ్బ కొట్టినాడట. అదేవిధముగా సమాజములోని దోషములను తొలగింప సమకట్టిన ఈ సంస్కర్తలు సమాజ వినాశమునే కల్గించుచున్నారు ఈ సందర్భముగా ఈ సంస్కర్తలు అదృష్టవశమున చలనములేని కొండలను ఢీకొనిరి అంతట వారే ఆయా ప్రతిఘాతములకు తుత్తునియలై పోయిరి. అపసవ్యమార్గమునకై సమా సంస్కరణార్థము ప్రయత్నములుచేసి విఫలు

రైన ఆ ఉదారచరితులు, స్వార్థరహితులు ఆ మహనీయులు శ్లాఘనీయులే. సంస్కరణాభిలాషతో వారు సమాజమున కిచ్చిన ఆ ఘాతములు, ఒడలు తెలియని నిద్రమత్తున మునిగిన సమాజమును తట్టిలేపుటకు అవసరమే. అయితే ఆ సంస్కర్తల ప్రయత్నములు నిర్మాణాత్మకముగా కాక కేవల విధ్వంసాత్మకముగా సాగినవి. విధ్వంసనాత్మకమైన పెల్లను నశ్వరమే. అందుచేతనే వారి ప్రయత్నములన్నీ విధిగా విఫలమైనవి. మనము వారి నాశీర్వదించి వారి అనుభవమునుంచి గుణపాఠము నేర్చుకోందము...ప్రాగ్దిశగా గాని, పశ్చిమ దిశగా గాని ఏ మార్గమున ప్రయత్నించినను, భారతదేశము రూపు మాసిపోయినగాని అది యూరోపా అగుట సాధ్యపడదు. అట్లు కావలెనన్నచో హైందవ జాతియే పూర్తిగా నశించిపోయి, క్రొత్తజాతి ఈ దేశము నాక్రమింపవలెను. అది ఏనాటికిని జరిగెడి పనికాదు.

కాని నా మాటలను గుర్తుంచుకోండి. మీరు ఆధ్యాత్మికతను విడిచిపెట్టినచో పాశ్చాత్యుల భౌతిక నాగరికత వెంట పరువులెత్తు

టకై ఆధ్యాత్మిక పరతను ప్రక్కకు నెట్టినచో- దాని ఫలితముగా మూడు తరములలో. మీ జాతి అంతరించిపోవును. ఏలనవగా – ఆధ్యాత్మికతను వదలిననాడు – మీ జాతికి వెన్నెముకయే విరిగిపోయిన దగును, జాతీయతా భవనపు పునాదియే కృంగిపోయిన దగును. ఫలితము – సర్వనాశనమే.

ఓ నా సోదరులారా! మనమందరము కష్టపడి శ్రమించెదముగాక. నిదురించుటకిది సమయము కాదు. మనము చేయు కృషిపైననే భావి భారత భాగ్యోదయము ఆధారపడియున్నది. దేశమాత మనకొరకు సిద్ధముగా ఎదురు చూచుచున్నది. ఆమె ఊరక కొంచెము కునుకు తీయుచున్నదంతే. లెండు. మేల్కొనుడు మన దేశ జనని పునరుజ్జీవితయై ఇంతకు మును పెన్నడు లేనంతగా ఇనుమడించిన శోభతో తన శాశ్వత సింహాసనము నధిష్ఠించి వెలుగొందుచుండుటను దర్శింపుడు.

దూషణ వాక్యముల నుచ్చరింపవలదు, మాటలను కట్టిపెట్టండి. ప్రేమపూర్వకముగా మీ హృదయకవాటములను తెరచియుంచండి.

ఈ దేశము యొక్క ప్రపంచమంతటి యొక్క విముక్తి కోసమును మీరు పాటుపడాలి. భారతమంతా తన ఒక్కని భుజస్కంధముల పైననే ఉన్నట్లుగా మీలో ప్రతి ఒక్కడును భావించి ఇందుకోసం పనిచేయాలి. వేదాంతతత్త్వము యొక్క జ్యోతిని, జీవమును ప్రతి యింటికిని గొనిపోయి ప్రతి జీవియందును దాగియున్న దివ్యత్వమును జాగృతమొనర్పుడు.

మీ నరములను బలిష్ఠముగావించుకొనుడు. ఈనాడు మనకు కావలసినది ఇనుపకండరములు, ఉక్కునరములు. చాలినంత పెద్ద కాలము మనము శోకములు పెట్టియున్నాము. రోదనలికచాలు. లేచి, మీ కాళ్ళపై మీరు నిలబడండి. పురుషులు కండు.

నిదానముగా పనిచేయండి. అన్నిటికన్న మిన్నగా పవిత్రముగా, నిజాయితీగా ప్రవర్తించండి. మీ గమ్యమును గురించి సంపూర్ణ విశ్వాసము కలిగి యుండండి___

ధనములేని మీపైననే అంతా ఆధారపడియుంది. పేదవారు గనకనే మీరు కష్టించి పనిచేస్తారు. ఏమియు లేనివారు గనుకనే మీరు

నిజాయితీగా ఉంటారు. మీరు నిజాయితీగా ఉంటారు గనుకనే సమస్తము త్యాగము చేయుటకు మీరు సిద్ధమవుతారు. ఇప్పుడు నేను మీకు చెబుతున్న విషయమదే.

ఆవేదన చెందండి. పరితాపము కలిగి యుండండి. నా బిడ్డలారా! పేదలకోసమై, అజ్ఞులకోసమై, పతితులకోసమై సానుభూతి పూర్వకమయిన ఆవేదన చెందండి. ఎంతగా పరితాపము చెందాలి అంటే, ఆ ఆవేదనవల్ల జనించిన ఆవేశ తీవ్రతతో మీ హృదయ స్పందనం ఆగిపోవాలి. మీ తల తిరిగిపోయి మతిభ్రమించునా అనిపించాలి. అంతటి సానుభూతిపూర్వకమయిన పరితాపమును పెంపొందించుకొని, పిమ్మట భగవంతుని పాదములకడ ఆత్మసమర్పణ గావింపుడు. వెంబడినే అధికారము, సహాయము, అజేయమయిన శక్తి లభింపగలవు. కష్టపడి పనిచేయండి. గత పది యేండ్లుగా "కష్టించి కృషి చేయండి" అనదే నా దీక్షావాక్యం. ఇప్పటికీ అదే మాట. "కష్టపడి పనిచేయండి" అనే చెబుతాను. అంతా నిరాశామయంగా ఉన్నపుడు 'కష్టించి పని

చేయండి' అని చెప్పేవాణ్ణి. ఆశాకిరణములు ప్రసరించ నారంభించుచున్న ఈ సమయంలో కూడా అదే మాటను "కష్టపడి పనిచేయండి" అని మరల చెప్పుచున్నాను. నా బిడ్డలారా! దేనికిని భయపడకండి.

ఉత్సాహాన్ని కల్గియుండి, అన్ని వయిపులా వ్యాపించండి. కృషి చేయండి. నాయకత్వము వహించి ముందుపడచే సమయమున సేవకునిగా మసలండి. నిస్వార్థముగా నుండండి. ఒక మిత్రుని మీద మరియొక మిత్రుడు చెప్పే కొండెపు మాటల కెన్నడూ చెవి యొగ్గకండి. అంతులేని ఓర్మిని కనబరచండి. విజయం మీదే—

జాగ్రత్త! అసత్యమయిన ప్రతివిషయం గురించి, ఎంతో జాగ్రత్తగా ఉండండి. సత్యమునే అంటిపెట్టుకొని యుండండి. మనము తప్పక గెలుపొంది తీరతాం, కొంచెం ఆలశ్యం అయితే కావచ్చునేమోకాని, నిశ్చయంగా మనం విజయం సాధించి తీరుతాం. మీలో ప్రతి ఒక్కని భుజస్కంధాలమీదా కార్యభారం మొత్తం పూర్తిగా మోపబడి యున్న

ట్లుగా భావించి పనిచేయండి. రాగల ఏబది శతాబ్దాల భవిష్యత్కాలము మీ వయిపు నిరీక్షిస్తూ ఉంది. భారతదేశపు భావిభాగ్యోదయము మీ మీదనే ఆధారపడియుంది. పని చేయడం సాగించండి.

నా విశ్వాసము యువతరమునందే, నవతరమునందే. నా ఉద్యమ నిర్వహణ కవసరమయిన కార్యకర్తలు వారిలో నుండియే రాగలరు. సింహములు మాదిరిగా వారు మొత్తము సమస్యను సాధింపగలరు. నేను నా ఆశయమును ప్రతిపాదించాను. ఆ ఆశయమును సాధించుటకోసమై నా జీవితాన్ని అర్పించాను. ఒక కేంద్రమునుండి మరియొక కేంద్రమునకు...భారతదేశము మొత్తమంతా అల్లుకొనువరకు వారు విస్తరింపగలరు.

మాతృదేశ సేవావసరమున తమ సర్వస్వమును త్యాగమొనర్చి దేశహితమునకయి స్వీయజీవితముల నాహుతి యొనర్ప సంసిద్ధులయిన యువకులు కొందరిప్పుడవసరమయి యున్నారు. అట్టివారి జీవితములను తీర్చిదిద్ద

కలిగినచో నిజముగా కొంతపని జరుగుటకు అవకాశమున్నది.

పరుల మేలుకొరకై చేసినపని ఎంతచిన్న దయిననూ అది మనలోగల అంతశ్శక్తిని మేలుకొల్పును. ఇతరులకు కొద్దిపాటి ఉపకారమును ఊహించుట సయితము హృదయమున సింహబలమును నెలకొల్పును. మీ అందరి పయిన నాకు అత్యంత ప్రేమగలదు. కాని, పర హిత కర్మాచరణమునందు మీ రందరు ప్రాణములనర్పించుట నాకిష్టము. మీ రట్లు చేయుట నాకెంతో ఆనందదాయక మగును—

లెండు కార్యోన్ముఖులు కండు, —

ఈ జీవితమెంతకాలము కొనసాగును! మీరీ లోకములోనికి వచ్చిన గుర్తుగా ఏదియో కొంత కార్యమును నిర్వహించిపొండు. లేనిచో, మీకును రాతిబండలకు, చెట్ల చేమలకు మధ్య గల భేదమేమి?

నరవరమున ఆపాదమస్తకము రజోగుణ ప్రసారముగల వీరుడు, సత్యమును తెలిసికొనుటకై మరణించుటకయినను వెనుదీయని ధీరుడు, త్యాగమేకవచముగ, జ్ఞానమే ఖర

వాలముగ ధరించిన శూరుడు — అట్టి వీరాగ్ర
గణ్యుని భావమే మనకిప్పుడు అత్యావశ్య
కము. జీవన సంగ్రామమున ధైర్యముతో
పోరు సలుపు వీరుని శౌర్యమే మనమిప్పుడు
వాంఛించునది. జీవితమును నందనోద్యాన
ముగా తలంచి ప్రేమసల్లాపములు సాగించు
ప్రేమికుని భావముతో మనకెంత మాత్రము
పనిలేదు.

ఆత్మవిశ్వాసము అలవరుచుకోండి. మీరు
గతములో ఒకనాడు వైదిక ఋషిపుంగవు
లుగా విరాజిల్లారు. ఈనాడు మీరు మరియొక
రూపమున జన్మించారు. అంతే. మీరందరూ
మీలో అనంతమయిన శక్తిని కలిగియున్న
సంగతిని నేను విస్పష్టముగా – పట్టపగటి సూర్య
కాంతిని చూచినంత విస్పష్టముగా చూచు
చున్నాను. మీలో ఉన్న ఆ అనంతశక్తిని
తట్టి లేపండి. లెండు! లెండు! నడుములు
బిగించి, హృదయపూర్వకముగా, ఆత్మ సమ
ర్పణతో కార్యనిర్వహణకు దిగండి. సంపద,
కీర్తి తాత్కాలిక మయినవి. వానితో మీ
కేమి పని? నా ఆలోచన మీకు తెలియునా?

ముక్తియో గిక్తియో అదంతా నాకు పట్టదు. పైన నేను చెప్పిన భావములను మీ అందరి లోను ఉద్దీపింపచేయుటే నా కర్తవ్యము. ఒక్క మనిషినయినా సరే, పైవిధముగా తీర్చి దిద్దుటకై వందల వేల జన్మ లెత్తుటకయినను నేను సిద్ధము.

కుమారా! మరణము అనివార్యమయినపుడు, ఎండిన చెట్టు మ్రానులవలెనో, రాతిబండల వలెనో నశించిపోవుటకన్న వీరోచితముగా మరణించుట కోరదగినదిగదా. తాత్కాలిక మయిన ఇహలోకమున మరియొకటి రెండు రోజులు అధికముగా బ్రతికియున్నందున ప్రయోజనమేమి? ఏదయినను పనిముట్టు ఊరక యుండి త్రుప్పుపట్టి చెడిపోవుటకంటె, ఉపయోగింపబడుచు అరిగిపోయి నశించుటే మేలు. అదేవిధముగా ఏమియు చేయక ఊరక జీవించుటకన్న, పరులమేలుకయి చేతనయినంత ఏ కొద్దిపాటి సాయమయినను చేయుచు మరణించుటే కోరదగినది.

శరీరములో చేవలేక, హృదయమున నుత్సాహము శూన్యమై, మెదడులో స్వతంత్ర

ఆలోచన వ్యగ్రులై – మీరు – ఈ నిర్జీవమాంస పిండములు ఏమి చేయగలరు! అట్టి వీరిని ఉత్తేజపరచి, వారిలో జీవచైతన్యమును తొణికింపజేయవలెనని నా సంకల్పము, ఈ పనికై నేను నా జీవితము సంకితమొనర్చినాను. వైదిక మంత్రములలో గల అమోఘ శక్తి ద్వారా నేను వారిని మేలుకొలిపెదను. "లెండు, మేల్కొనుడు—ఉత్థిత, జాగ్రత" అను భయరహిత సందేశమును వారికి చాటి చెప్పుటకే నేను జన్మించినాను. ఈ నా కృషిలో మీరందరూ తోడ్పడండి.

సంఖ్యాబలము లెక్కలోనిది కాదు. సంపద గానీ దారిద్ర్యముగానీ లెక్కచేయవలసిన పని లేదు. ఈ ప్రపంచమును క్రక్కదలించుటకు ఒక కొద్దిమంది మాత్రము చాలు. అయితే వారు త్రికరణశుద్ధిగా ఏకమయి పనిచేయాలి. ఈ దృఢవిశ్వాసము నెన్నడును మరువకు. ప్రతిఘటన యెంత యెక్కువగానున్న అంత మంచిది. గతికి నిరోధమే గనుక లేకున్నచో నదికంత ఉరవడి కలుగునా! ఒక విషయం ఎంత విస్తృతముగా నుండిన, ఎంత శ్రేష్ఠతరమయిన

అంతగా ప్రతికూలతను అది ప్రారంభదశలో ఎదురుకొనవలసి యుండును. ప్రతికూలతయే కార్యసాఫల్యతను సూచించునది.

మొప్పదలరానీ, రాకపోనీ, ఈ యువకులను ఒక వ్యవస్థగా రూపొందించుటకే నేను జన్మించాను. వీరేకాదు, ప్రతి పట్టణంలోనూ ఇంకను వందలాదిగా యువకులు నాతో చేరి నేను చెప్పినట్లు చేయుటకు సంసిద్ధులయి యున్నారు. వారినందరిని అనివార్య తరంగాల వలె భారతదేశం అంతటా పంపిస్తాను. వారి ద్వారా ఉపశాంతిని, నైతికత్వమును, మతమును, విద్యను — వీటిని, అధఃపతితులు దళితులు అయిన దీనుల ఇంటివాకిటకు గొనిపోయి అందజేసెదను. ఈ పనిని నేను నెరవేర్చితీరెదను. లేదా నా ప్రాణములనయినను విడచెదను.

మీరు నిజముగా నా బిడ్డలే అయినచో దేనికిని మీరు భయము చెందరు. ఏదియును మిమ్ములను అడ్డగింపజాలదు. మీరు సింహముల వలెనుందురు. మనము మన మాతృదేశమును, యావత్ప్రపంచమును జాగృతం చేయాలి. —

తమ పనిని సాధించుటకై అవసరమయినచో అగ్నిలో దుముకుటకయిననూ నా బిడ్డలు సంసిద్ధులయియుండాలి.

ఓ నా భారతదేశమా! నీ సతీత్వాదర్శము సీత, సావిత్రి, దమయంతి, అని మరువకు. నీ పూజలందుకొను దైవము – సర్వసంగపరిత్యాగియు, యతులకెల్ల యతీశ్వరుడు నయిన శంకరుడు – ఉమాపతి, అను మాట మరువకు. నీ వివాహము, నీ సంపద, నీ జీవితము – ఇవన్నియు విషయ సుఖము లనుభవించుటకు కాదనియు మరచిపోకు, దేశమాత యజ్ఞవేదికపై ఆహుతి అగుటకే నీవు జన్మించితివని మరువకు.

నిన్ను దళిత జాతులు, అజ్ఞానులు, దరిద్రులు, నిరక్షరాస్యులు, చెప్పులు కుట్టెడివారు, వీధులూడ్చెడివారు ...... వీరంతా నీ రక్తమాంసములే, నీ సహోదరులే అని మరువకు.

ప్లేగువ్యాధిగాని, క్షామముగాని. ఎచ్చటెచ్చట సంభవించునో, ఎచ్చటెచ్చట ప్రజలు ఆపదలపాలయి బాధపడుచుందురో అట్టి తావులకు మీరందరూపోయి వారిని ఆదుకోవండి. ఆ ప్రయత్నమున మీరొకవేళ మరణించవచ్చును.

అయిననేమి? ప్రతి దినమును క్షుద్రకీటకముల మాదిరిగా మీవలె నెందరెందరు పుట్టుటలేదు, చచ్చుటలేదు? దానివలన ఈ మహాప్రపంచమున మార్పు ఏమయిన సంభవించినదా? మరణము తప్పదు. కాని ఒక మహోన్నత ఆదర్శమును గైకొని దానికొరకై ప్రయత్నించుచు మరణింపుడు. ఒక ఉన్నత ఆదర్శమునకై పని చేయుచు మరణించుట శ్రేయస్కరము.

బయటనుండి వచ్చు విదేశీ సహాయముపై నీ వెంతమాత్రం ఆధారపడకూడదు. వ్యక్తుల మాదిరిగానే, దేశములు కూడా తమకు తామే సహాయ మొనర్చుకోవాలి. ఇదే నిజమయిన దేశభక్తి. ఒక దేశమట్లు స్వయముగా అభివృద్ధి చెందజాలకున్నచో, దానికి తగిన సమయం ఇంకా రాలేదని అర్థం. తగిన సమయం వచ్చే వరకు ఆ దేశం వేచియుండక తప్పదు.

నీలో ఊపిరి యున్నంతవరకు పనిచేస్తూనే ఉండు. నీ వెంట తోడుగా నే నున్నాను. నేను మరణించిన పిమ్మట నా ఆత్మ నీతో కలసి పని చేస్తుంది. ఈ జీవితం వస్తుంది, పోతుంది. సంపద, కీర్తి, సుఖభోగములు — ఇవి మూడు

నాళ్ళు ముచ్చటలే. ప్రపంచమున కొట్టుమిట్టాడు ఒక క్షుద్రకీటకమువలె చచ్చుటకన్న, సత్యము నుపదేశించుచు విధినిర్వహణా క్షేత్రరంగమున ప్రాణములు విడచుట ఎంతో మంచిది. సాగి పొమ్ము! ముందుకు సాగిపొమ్ము!

---

# 9. ఆతర ప్రబోధములు

వ్యాకుల పడవద్దు, పెనుగాలి తాకిడి దెబ్బ తగులునది పెద్ద చెట్టునకే. చిదుగులను కదుల్చుట నిప్పును మరింతగా రగులునట్లు చేయును. నెత్తిమీద దెబ్బ తగిలిన పాము బుస్సుమని పడగనెత్తును — ఇట్లే మిగిలినవియు. హృదయము వేదనాభరిత మయినపుడు; విచారపు తుఫాను అన్నివయిపులా విజృంభించినపుడు; ఇక వెలుగు కనిపించు ననెడి ఆశ అడుగంటి పోయినపుడు; ఆశయును ధైర్యమును దాదాపుగా శూన్యమయిపోయినపుడు — ఆ ఆధ్యాత్మిక పెనుతుఫాను మధ్యమున లోపలనుండి బ్రహ్మముయొక్క ప్రకాశము తళుక్కుమని మెరయును. సుఖసంపదలలో పుట్టిపెరిగి, హంసతూలికాతల్పమున శయనించుచు, ఎన్నడును ఒక్క కన్నీటిచుక్కనయినను కార్చియెరుగని వాడెవడయినను, గొప్పవాడయినాడా!

అట్టివాడు ఎవడయినను లోనున్న బ్రహ్మ
మును ఆవిష్కరించినా?

హృదయమునకును బుద్ధికిని మధ్య సంఘర్షణము సంభవించినపుడు హృదయము చూపించు మార్గమునే అనుసరింపదగును. ఎందుచేత ననగా మేధాశక్తి ఒక్క హేతువాద స్థాయిని మాత్రమే కల్గియున్నది. ఆ స్థాయినిమించి అది దాటిపోజాలదు. బుద్ధి వైభవము ఏనాటికిని అందుకొనలేని ఉన్నత స్థాయికి హృదయము కొనిపోగలదు. హృదయము ధీశక్తిని అధిగమించిపోయి, బ్రహ్మజ్ఞాన ప్రేరణమును కూడ చేర్చగలదు.

హృదయము గలవారికి లభించునది వెన్న. కాగా బుద్ధిశీలురకు మిగులునది మజ్జిగ మాత్రమే.

మనమందరము న్యాయవర్తనులమై మెలిగెదము గాక. ఆదర్శము ననుసరించి మనము ప్రవర్తింపజాలని పక్షమున మనము మన బలహీనతను అంగీకరించెదము గాక. అంతేగాని, ఆదర్శమును మాత్రము పతనము చెందనీయవలదు. ఎవరయినగాని, ఆదర్శమును దిగజార్చనీయదగదు.

అసత్యమునుండి సత్యమునకు గాక మానవ జాతి సత్యమునుండి సత్యమునకు మాత్రమే పయనించుచున్నదని నీవు తప్పక గుర్తుంచు కొనవలెను. దీనినే, నీకు మరింతగా నచ్చు నట్లు చెప్పవలసి వచ్చినచో—మానవజాతి క్రింది అంతస్తులో నున్న సత్యమునుండి ఉన్నత స్థాయికి చెందిన సత్యమునకు పయనించుచున్న దని చెప్పవచ్చును. (అంతేకాని, అసత్యము నుండి మాత్రము ఎన్నడును బయలుదేరుట లేదు.) అసత్యమునుండి సత్యమునకు మాత్రము ఎన్నడును మానవజాతి పయనించుటలేదు.

జీవియొక్క స్థాయి అధమతరమయిన కొలదీ విషయ సుఖములలో ఆ జీవిపొందు ఆనందము అధికతరముగా నుండును. కుక్కగాని లేదా తోడేలుగాని తన ఆహారమును ఆరగించు వంతటి ముక్కువతో ఏ కొద్దిమంది మాత్రమో మానవులు ఆహారమును ఆస్వాదింపగలరు. కానీ, ఆ కుక్క లేక తోడేలుయొక్క ఆనం దానుభవము లన్నియు సహజముగా వాని యింద్రియములను మాత్రమే చేరివ వగు చున్నవి. అన్ని జాతులయందును, అధమ తర

గతి మానవులు ఇంద్రియ సుఖములందే ఆనందము ననుభవించుదురు. విద్యావంతులు, సంస్కారపరులు అయినవారు మాత్రము భావనలోను, వేదాంతము నందును, కళల లోనూ, శాస్త్రములందును ఆనందానుభూతిని పొందుదురు. ఆధ్యాత్మికత ఇంతకన్నను ఉన్నత స్థాయికి చెందినది.

బుద్ధుడు, క్రీస్తువంటి మహనీయుల చరిత్రయే ఈ ప్రపంచ చరిత్ర. నిష్కాములు, సంఘహితులు అయినవారు ప్రపంచ సంక్షేమమునకు అధికముగా పాటుపడుచుందురు.

చేపట్టిన ప్రతి పనియందును విజయమునందుచున్న ప్రతి వ్యక్తికిని వెనుక తోడుగా, ఎచ్చటనో అచ్చట అద్భుతమయిన చిత్తశుద్ధియు, అద్భుతమయిన నిజాయితీయును ఉండితీర వలెను. వాని జీవితమున అసాధారణ విజయమునకు కారణమిదియే. అతడు పరిపూర్ణముగా స్వార్థరహితుడు కాకపోవచ్చును కాని, అతడా లక్ష్యమునకు మొగ్గు చూపుచున్నాడు. అతడే సంపూర్ణముగా స్వార్థరహితుడయి యుండిన యెడల, అతని విజయము బుద్ధునియొక్క-

లేదా క్రీస్తుయొక్క విజయమంతటికిదే అయియుండెడిది. ఎక్కడయినను నిస్వార్థత అను దాని పరిమాణ తీవ్రత కార్యసాఫల్యతా తీవ్రతను నిర్ణయించునదై యుండును.

సత్యము, పవిత్రత, స్వార్థరాహిత్యము — అనునవి ఎచ్చట ప్రవర్తిల్లునో అచ్చట సృష్టిలోని ఏ శక్తియు ఈ సద్గుణములు కలిగియున్న వానిని నశింపచేయజాలదు. ఈ ఉపకరణములను కలిగియున్న వ్యక్తి సమస్త విశ్వము తన నెదిరించినను ప్రతిఘటించి నిలుచుటకు సమర్థుడగును.

సాగిపొండు! కూడని పని ఏదయినను చేసియున్నట్లుగా మీకు తోచినయెడల, అట్టి సందర్భమున మీరు వెనుదిరిగి చూడకుడు. ఇంతకు మునుపు మీరే ఆ పొరబాట్లను చేసియుండనిచో ఈనాడు మీరు ఈ స్థితిలో ఉండియుండగలరని మీరు విశ్వసించెదరా? అందుచే మీ పొరబాట్లను మెచ్చుకొండి. ఆ పొరబాట్లే మీ పాలిట ప్రచ్ఛన్న అదృష్టదేవతలు. కష్టమును మెచ్చుకొండి. సుఖమును మెచ్చుకొండి. మీ పరిస్థితి ఎట్టిదైననూ కష్టమయినను సుఖమయి

నను దానిని సరకు చేయకండి. మీ ఆదర్శమును మాత్రము వదలకుండా అంటిపెట్టుకొని యుండండి. సాగిపొండు. ముందుకు సాగిపొండు!

పరులకు మంచిని గావించుటే పుణ్యము (ధర్మము), పరులకు హానిగావించుటే పాపము. బలము, పౌరుషము పుణ్యము; బలహీనత పిరికితనము పాపము. తన కాళ్ళపై తాను నిలబడి స్వతంత్రముగా మనుగడ సాగించుట పుణ్యము, ఇతరులపై ఆధారపడి జీవించుట పాపము. ఇతరులను ప్రేమించుట పుణ్యము; ద్వేషించుట పాపము. భగవంతునియందు, తన ఆత్మయందు గల నమ్మకమే, పుణ్యము, సందేహామే పాపము. ఏకత్వమును గురించిన జ్ఞానమే పుణ్యము, భిన్నత్వమును చూచుటే పాపము.

ఈ ఆధునిక కాలమున ఏ వ్యక్తి అయినను మోజెస్‌నుగాని, బుద్ధునిగాని, క్రీస్తునుగాని ఉదహరించినచో అతడు పరిహాసాస్పదుడగుచున్నాడు. కాని, ఆ వ్యక్తియే హక్స్లే, టిండాల్, డార్విన్ వంటివారి పేర్లను ఉదహరించినంతనే, వారి పేర్లను ఉచ్చరించినంత

మాత్రమునసే – చాలు – మరి నోరెత్తక అంద రును ఆమోదింతురు. "హక్స్లే ఇట్లన్నాడు" అని ఉటంకించిన చాలును. చాలమందికి అది పరమసత్యమే. నిజముగా మనము అంధవిశ్వా సాలకు అతీతముగా ఉన్నాము!! మొదట నుదాహరించినది మతపరమయిన అంధవిశ్వా సము కాగా, ఇది శాస్త్రపరమయిన మూఢ విశ్వాసము. మొదటి విశ్వాసమువలన జీవన ప్రదములయిన ఆధ్యాత్మిక భావములు వెల్లి విరిసినవి. కాగా, ఈ ఆధునిక గ్రుడ్డినమ్మక ముల కారణముగా లోభమోహములు ప్రబలు చున్నవి. మొదటిది దైవారాధనము కాగా, ఇది హేయమయిన ధనము, కీర్తి, ప్రతిష్ఠ, అధికారముల ఆరాధనము. ఇదే ఈ రెండు రకముల విశ్వాసముల మధ్యగల భేదము.

ఈ భూమి మీాద నిజమయిన సమత్వము ఇంతవర కెన్నడును ఉండి యుండలేదు. ఇక ఎన్నడును ఉండదు. ఇక్కడ మనం అందరం సమానముగా ఉండుట యెట్లు సమకూడును? సాధింపజాలని ఈరకపు సమత్వము మరణమే యగును. — మనిషికి మనిషికి మధ్యయున్న భేద

మును కలుగఁజేయుచున్నది ఏది? బుద్ధి వైభవములోని భేదాయే ఎక్కువగా ఈ భేదమునకు కారణమగుచున్నది. మనమంతా సమానమైన తెలివితేటలతో జన్మించితి మని పిచ్చివాడు మినహా మరియెవ్వడును ఈ రోజులలో అనడు.

ఉన్నతమయిన ఆదర్శభావములను ప్రతి మానవుని ఇంటి గుమ్మము వద్దకును గొనిపోవ గల వ్యవస్థను కార్యరంగమున ఆరంభము చేయవలెను —— ఇదే నా జీవితమునంతా నిండియున్న ఆశ. అట్లు ఉన్నతమయిన భావములు తమముంగిట అందజేయబడిన పిమ్మట, స్త్రీ పురుషులు ఎవరికి వారే వారి భవితవ్యమును నిర్ణయించుకొను నవకాశమును ఈయవలెను. మనపూర్వీకులు, అన్య దేశములవారు, జీవితమునకు సంబంధించి అత్యంత ముఖ్యమయిన సమస్యల విషయమై ఏమేమి అభిప్రాయములను కలిగియుండిరో వారిని (ప్రజలను) తెలిసికొననిండు. ముఖ్యముగా, ఈనాడు ఇతరులు ఏమిచేయుచున్నారో చూచిన పిమ్మట వారిని ఒక నిర్ణయమునకు రానిండు. రాసాయనిక ద్రవ్యములను ఒకచోట చేర్చుటయే మనము

చేయవలసిన పని. అటు పిమ్మట ప్రకృతియే తన నియమముల ననుసరించి స్ఫటికీకరణమును గావించును. కష్టించి పనిచేయండి. నిదానముగా పనిచేయండి — "జనసామాన్యమును వారి మతమునకు హాని యొనర్పకుండా సముద్ధరించుట" అను నాదర్శమును మీ ముందుంచుకొని కృషిచేయండి.

జనానీకము నిన్ను పొగడనీ లేదా తెగడనీ; అదృష్టము నీకు అనుకూలముగానీ లేదా ప్రతికూలింపనీ; నీ శరీరము ఈ రోజే సమసిపోనీ లేదా ఒక యుగము గడచిన పిమ్మట నశింపనీ; సత్యమార్గమునుండి నీ వెన్నడును మరలకుండ చూచుకో. శాంతి యనెడి రేవును చేరుటకు ముందుగా ఎన్నియో తుఫానులను, అలల కల్లోలమును దాటవలసియున్నది. ఒక మనిషి ఎంతటి ఉన్నతతర స్థితిని చేరుకొనిన, అతడంతటి తీవ్రతరమయిన కఠినపరీక్షలను అధిగమించి యుండవలెను.

నీచమయిన యుక్తుల నుపయోగించుట ద్వారా ఈ ప్రపంచమున గొప్పపని ఏదియును సాధింప బడదని నా దృఢవిశ్వాసము.

నేను నాజీవితమున ఈ విషయమును గమనించి యున్నాను,—ఎవడయితే తనను గురించి అతిజాగ్రత్తగా ప్రవర్తించునో అట్టివాడు అడుగడుగునా అపాయముల పాలగుచునేయుండును. గౌరవము మర్యాదయు పోవునని ఎవడయితే భయపడుచుండునో అట్టివాడు అవమానమును మాత్రమే పొందుచుండును. ఎవడయితే ఎల్లప్పుడును నష్టమును గురించి భయపడుచుండునో అట్టివాడెప్పుడును నష్టపోవుచునే యుండును.

నా జీవితమున ఏలక్ష్యమును సాధింపవలెనో అది నాకు తెలియును. ఉత్కటమయిన సంకుచిత దేశాభిమానము నాకులేదు. నేను ప్రపంచమంతటికి ఎట్లు చెందియున్నానో ఆదేవిధముగా భారతదేశమునకును చెందియున్నాను.

... విద్యావంతులయిన హిందువులలో మాత్రమే కనుగొనగల్గిన; కులవిభేదభావపూరితులు, అంధవిశ్వాసయుతులు, దయాహీనులు, వంచకులు, నాస్తికులు, పిరికిపందలు అయిన వారిమధ్యలో జీవించి సమసిపోవుటకే నేను జన్మించితినని నీవు భావించుచున్నావా? పిరికి

తనమనిన నాకు పరమ ద్వేషము. అసహ్యము: పిరికిపందలతోగాని, అర్థరహితపు రాజకీయపు చెత్తతోగాని నాకేమియు పనిలేదు. ఏ రాజకీయములందును నాకు నమ్మకములేదు. దైవము సత్యము — ఇవే, ప్రపంచమునగల రాజకీయములు, మిగిలినదంతా వట్టిచెత్త.

ఆత్మతత్త్వమును అన్వేషించు జీవిత విధానములో నాకు ఆనందము కలుగనంతమాత్రమున; ఇంద్రియవిషయ సుఖములతో కూడిన జీవితమున సంతృప్తికోరకై నేను వెదుకులాడవలెనా! అమృతమును పొందలేనంత మాత్రమున, నేను మురికినీటిని త్రాగుటకు దిగజారి పోవలయునా!

పరమ పావనుడయిన పవిత్రాత్మకవే నీవు. ఉత్తిష్ఠత జాగృత. ఓ మహాశక్తి సమాపేతా! ఈ నిద్ర నీకు తగదు లెమ్ము. మేల్కొనుము. నీకిది తగదు. దుర్బలుడవని దుఃఖితుడవని నీవు భావించుకొనకుము. సర్వశక్తిమంతా లెమ్ము, మేల్కొనుము. నీ సహజ స్వభావమును ప్రకటన మొనర్చుము. నిన్ను నీవు పాపివిగా భావించుకొనుట అనుచితము, నిన్ను

నీవు దుర్బలుడవుగా భావించుటయు అనుచితమే. ఈ సంగతిని ప్రపంచమునకు చాటి చెప్పుము నీకు నీవు ఎరుక పరచుకొనుము. అందువల్ల ఆచరణాత్మకముగా ఎట్టి ఫలితము ఒనగూడునో గమనింపుము; విద్యుద్యోగముతో సమస్తమును ఎట్లు ఆవిర్భవించునో పరికింపుము. సమస్తమును ఎట్లు మార్పు చెందుచున్నదో గుర్తించుము. దానినే మానవకోటికి బోధించుము. వారి సామర్థ్యమును వారికి తెలియజెప్పుము.

నా ఆశయు, విశ్వాసమును నీ వంటివారి పయిననే ఆధారపడియున్నవి. నా మాటలలోని యథార్థతత్త్వమును సరిగా అర్థము గావించుకో. ఆ మాటల వెలుగులో ఆ వెలుగు ఆధారముగా నీవు కార్యోన్ముఖుడవుగమ్ము.

నీకు చాలినంతగా సలహా ఇచ్చియున్నాను. అందులో ఒకింత అయినను ప్రస్తుతము ఆచరణమున చేసి చూపించుము. (అట్లు చేయుట ద్వారా) నా పలుకులను నీవు అలకించుట సార్థకమేనని లోకమును గ్రహింపనిమ్ము.

